# మీ చర్మానికి
# ప్రకృతిసహజమైన సౌందర్యం




# వేప్

టాయ్‌లెట్ సోప్

వేప్ అంతరతంగా వెమ్మను కలిగిన సబ్బు మీ చర్మం ఎండి బీటలువారకుండాను ముడతలు పడకుండాను సంరక్షించి అభ్యంగస్నానంవల్ల కలిగే సకల ప్రయోజనాలను సమకూర్చగలదు దీని సువాసనతీనే పరిమళం మిమ్మావహించుతూ చర్మాన్ని పరిశుభ్రపరచే దీని గుణం ప్రకృతిసహజమైన కళ కాంతులతో రూప సౌందర్యాలు పుట్టిపడేటట్టుగా మీకు తగిన సంరక్షణను సమకూర్చగలదు

ప్రభుత్వ సంస్థ యొక్క ఒక విశిష్టమైన తయారీ

మీ చర్మానికి అవశ్యమయ్యే ప్రకృతిసహజమైన సంరక్షణకు- **వేప్**

కేరళ సోప్స్ & ఆయిల్స్ లిడ్,
కాలికట్

FDS KSO 3383A TEL

# అపూర్వమైన సువాసన...
# పుష్కలమైన నురుగు...



## మీకే తెలుస్తుంది, యిది
## అత్యుత్తమ⁺ నాణ్యమైనదని.







సూపర్ పవర్

**చెక్**⁺

డిటర్జెంట్ బిళ్ళ

| | |
|---|---|
| మామూలు ధర | రూ ~~2·38~~* |
| చెక్ ప్రత్యేక ధర | రూ 1 88* |

ఈ తగ్గింపు ప్రతి 1 కొనుగోలుకు 6 సబ్బుల వరకు మాత్రమే పరిమితం

అపూర్వమైన తాజా సబ్బు సువాసన దీనిని స్నానానికి వుపయోగించుదామా అనే కోరిక మీకు కలుగ చేస్తుంది

చెక్ యొక్క పు  మైన నురుగు మీ బట్టలు ఎంతో తెల్లగాను మరియు ఎంతో ప్రకాశవంతముగాను చేస్తుంది




ఇది గ్యారంటీ యివ్వబడిన అత్యుత్తమ నాణ్యతకు చిహ్నం డిటర్జెంట్ బిళ్ళ కొనే ప్రతిసారి మీరు యీ చిహ్నంకోసం చూడండి

⁺ పూర్తిగా తృప్తి కలుగనిచో సబ్బును తిరిగియిచ్చి సొమ్మును వాపసు పొందండి

**చెక్ తో ఉతకండి తేడా చెక్ చేయండి**

* స్థానిక పన్నులు అదనం

# చేయెత్తి జైకొట్టు తెలుగోడా!

మీ విజయమే మా లక్ష్యం — మా పూర్వ విద్యార్థులే మీకు సాక్ష్యం

**1980** లో మా వద్ద చదివి మెడికల్, ఇంజనీరింగ్ ఎంట్రన్సు పరీక్షలో నెగ్గినవారి వివరాలు చూడండి.

### 1980 మెడికల్ ఎంట్రన్సు ఫలితాలు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 100011 | 100094 | 100137 | 100142 | 100203 | 100227 | 100235 | 100236 | 100280 | 100292 | 100328 |
| 100352 | 100362 | 100372 | 100386 | 100406 | 100407 | 100422 | 100453 | 100454 | 100471 | 100478 |
| 100487 | 100496 | 100536 | 100571 | 100586 | 100590 | 100595 | 100597 | 100640 | 100698 | 100743 |
| 100788 | 100799 | 100885 | 100892 | 100910 | 100916 | 100942 | 101020 | 101103 | 101190 | 101213 |
| 101250 | 101258 | 101390 | 101606 | 101661 | 101778 | 101796 | 101840 | 102018 | 102072 | 102137 |
| 200021 | 200179 | 200190 | 200275 | 200323 | 200341 | 200441 | 200584 | 200636 | 200769 | 200874 |
| 200880 | 201004 | 201146 | 201168 | 201400 | 201512 | 201531 | 201579 | 201637 | 300003 | 300037 |
| 300054 | 300071 | 300096 | 300105 | 300128 | 300248 | 300303 | 300311 | 300381 | 300496 | 300500 |
| 300570 | 300672 | 300700 | 300721 | 300726 | 300732 | 300856 | 300987 | 301096 | 301217 | 301241 |
| 301243 | 301244 | 301262 | 301285 | 301393 | 301441 | 301474 | 301555 | 301577 | 301667 | 400072 |
| 400077 | 400120 | 400170 | 400258 | 400412 | 400436 | 400442 | 400466 | 400532 | 400577 | 400592 |
| 400600 | 400607 | 400630 | 400699 | 400751 | 400803 | 400812 | 400874 | 400977 | 400987 | 401004 |
| 401005 | 401033 | 401046 | 401069 | 500033 | 500037 | 500070 | 500072 | 500091 | 500106 | 500110 |
| 500115 | 500119 | 500122 | 500128 | 500133 | 500135 | 500138 | 500228 | 500286 | 500326 | 500357 |
| 500374 | 500398 | 500404 | 500421 | 500423 | 500514 | 500578 | 500662 | 500679 | 500711 | 500737 |
| 500749 | 500755 | 500771 | 500802 | 500826 | 500829 | 500888 | 500917 | 500987 | 501000 | 501035 |
| 501081 | 501096 | 501213 | 501245 | 501281 | 501302 | 501335 | 501391 | 501465 | 501489 | 501553 |
| 501682 | 501716 | 501808 | 501868 | 501877 | 501880 | 502052 | 502123 | 502332 | 502404 | 502431 |
| 502435 | 502477 | 502602 | 502769 | 502839 | 600001 | 600020 | 600034 | 600058 | 600086 | 600087 |
| 600099 | 600137 | 600200 | 600243 | 600348 | 600380 | 600442 | 600502 | 600559 | 600580 | 600695 |
| 600701 | 600882 | 600992 | 601039 | 601125 | 601339 | 601507 | 601508 | 601572 | 601630 | 601703 |
| 601735 | 601750 | 601763 | 601960 | 602012 | 602208 | 602468 | 602952 | 602953 | 602987 | 603156 |
| 603325 | 603505 | 603526 | 603544 | 603607 | 603687 | 603819 | 604007 | 604009 | 604047 | 604097 |
| 604509 | 604512 | 604533 | 604678 | 604800 | 605143 | 700049 | 700069 | 700098 | 700159 | 700259 |
| 700263 | 700272 | 700367 | 700417 | 700480 | 700525 | 700538 | 700566 | 700724 | 700751 | 700763 |
| 700810 | 700864 | 700966 | 700970 | 701358 | 800062 | 800091 | 800167 | 800181 | 800220 | 800237 |
| 800270 | 800277 | 800364 | 800392 | 800565 | 800740 | 800809 | 800811 | 800824 | 800841 | 800856 |
| 800898 | 800989 | 801100 | 801138 | 801221 | 801240 | 801325 | 801399 | | | |

### 1980 ఇంజనీరింగ్ ఎంట్రన్సు ఫలితాలు

53, 62 131, 169, 298, 337, 339 340, 353, 430 489, 528, 561, 640, 686, 777 835, 1021, 1054, 1062, 1069 1082 1090, 1217, 1227 1262, 1350 1407, 1484 1887 1997, 2542 2569, 2990, 3067 3345, 3351 3532 3841 3955, 3989 4153 4417, 4455 4507, 4575, 4584 4587, 4634 4675, 4959, 5022, 5138 5570 5976 6544, 6984 6991 7885, 7886, 8469, 10362, 10539, 10560, 12531, 12628, 12913, 12947, 12951, 14254, 15199, 15396, 15498, 15746, 15962

విశాల భారతదేశంలో ఎవరైనా ఎప్పుడైనా ఇటువంటి ఫలితాలను సాధించారా ? ★ ఆలోచించకండి — రండిపోదాం పై పైకి !

★ రెండవ సంవత్సరం ఇంటర్ పరీక్షలయిన వారం రోజులలో క్లాసులు ప్రారంభమవుతాయి ★ I Year ఇంటర్‌లో గ్రూపులో 70 శాతం మార్కులు వచ్చిన FC వారు, 50% మార్కులు వచ్చిన BC., SC, ST, విద్యార్థులు మాత్రమే ప్రవేశానికి అర్హులు

ఇంకా వివరాలకు : **రవి కళాశాల** బ్రాడీపేట, గుంటూరు—2

**CVN ధన్** M A, డైరెక్టర్ ◆◆ **C రూపీలక్ష్మీబాయి**, M.A.,M Ed

ఫోన్స్ 20917, 21192, 21545 ** హాస్టల్సు 21945, 24663, 24465

SUVARNA

## హత్యకి దారితీసిన అప్పు!

తమిళనాడు వెక్టనాల్ చవుట్రీ అనే వూరుకు చెందిన 40 ఏళ్ల పళని అనే అతను చిన్నతాయి అనే ఆమె వద్ద వెయ్యి రూపాయలు అప్పుగా తీసుకుని ఎన్నాళ్లూ ఎన్నేళ్లూ అయినా ఇవ్వలేదట దాంతో చిన్నతాయి పంచాయితీపెట్టి తనకు రావాల్సిన అసలు వడ్డీచేర్చి మొత్తం 1350 రూపాయలు గోల్లాడగొట్టి వసూలు చేసుకుందట తనమీద పంచాయితీపెట్టి తనపరువును బజారులో కలిపిందని పళని ఆ చిన్నతాయిమీద పగబట్టి కాపువేసి ఒంటరిగా ఒకనాడు కొబ్బరితోటలో నడిచివస్తున్న ఆమె మీద లంఘించి కొడవలితో ఆమెను ఖండ ఖండాలుగా నరికి పారేశాడట

## తాగితే పుట్టే పిల్లలు ?

గర్భిణీ స్త్రీలు తాగడం మంచిది కాదనీ, తాగుడు వదల లేని ఆడవారు రోజుకు రెండుసార్లకన్నా ఎక్కువ తాగనేకూడదనీ, నిండు నెలల కాలంలో మితి మీరి తాగితే పుట్టే పిల్లలు అష్టావక్రులుగా పుడతారనీ నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఆల్కహాల్ ఎ బ్యూజు అండ్ ఆల్కహాలిజం [ఎన్ ఐ ఎ ఎ ఎ] డైరెక్టరు డాక్టర్ ఎర్నెస్ట్ పి నోబి అన్నారట

## విజ్ఞాన పాఠం!

మెక్సికోకు చెందిన ఓ 23 ఏళ్ల అమ్మాయి ఓ 15ఏళ్ల అబ్బాయితో సెక్సు సుఖం అనుభవించిందన్న కేసు న్యూమెక్సికో సుప్రీంకోర్టు విచారించిందట 15ఏళ్ల కుర్రాడితో లైంగికసంబంధాన్ని నేను బలాత్కారంగాగానీ తప్పుగాగానీ భావించను అది కేవలం సెక్స్ విజ్ఞాన పాఠంగానే నేను పరిగణిస్తాను అట్టి సెక్స్ పాఠం ఆ కుర్రవాని భవిష్యత్ జీవితంలో ఎంతగానో ఉపయోగపడుతుందని నేను భావిస్తున్నాను ఇది మానసిక వికాసానికి దోహదపడుతుంది— అని సుప్రీంకోర్టు జడ్జి సుటిన్ అన్నారట

## సంచార వేశ్యా గృహం!

బ్రిటిష్ కొలంబియాకు చెందిన 28 ఏళ్ల అమ్మాయి ఓ వేశ్యా గృహం నడుపుతోందట ఈవిడకు ఓ బ్రహ్మాండమయిన ఐడియా వచ్చిందట పట్టణాలకు, వూళ్లకు బహు దూరంగా ఉండి ఉద్యోగాలతోనో, లేక మిలిటరీ డ్యూటీలతోనో సతమతమయ్యే పురుషపుంగవులకు స్త్రీసుఖం ఇచ్చేనిమిత్తం ఒక మొబైల్ ప్రాస్టిట్యూషన్ యూనిట్ నడుపడానికి తనకు పర్మిషను ఇవ్వమని ప్రభుత్వాన్ని కోరిందట ఒక లారీ నెంటి దానిలో మూడో, నాలుగో రూములు కట్టి, చక్కని అందమైన యవ్వనంలో ఉన్న అమ్మాయిల్ని ఆ లారీలో ఎక్కించుకుని అలాంటి పురుష పుంగవులుండే చోటుకి వెళ్లి వారి మన్మథావస్థను తీర్చడమే తనధ్యేయమని ఆమె ప్రభుత్వానికి విన్నవించిందట మగవానికి మనస్సు నిర్మలంగా ఉండటానికి, తన పనిమీద మనస్సు లగ్నం కావడానికి ఇలా మన్మథావస్థను తీర్చే తీరాలని, అది చాలా ముఖ్యమయినదనీ ఆవిడ తన దరఖాస్తులో విన్నవించిందట

## అర్స్ కుమార్తె మృతి!

కర్ణాటక మాజీ ముఖ్యమంత్రి దేవరాజ అర్స్ రెండో కూతురు 35 ఏళ్ళ నాగరత్న అనే ఆవిడ తన భర్త డాక్టరు నటరాజుతో కలిసి బెంగుళూరుకు చెందిన బొమ్మన హళ్లిలోని తమ పొలాలు చూసుకోడానికి వెళ్లారట, మొన్న 22వ తేదీన తెలవారుజామున పొలం చూసుకుంటూ పొలంలో ఓ మూల త్రవ్వే నూతిని చూడ్డానికి వెళ్తుండగా ఆవిడ నుయ్యి త్రవ్వుతున్న నేలకి దగ్గరగా వెళ్లేసరికి ఆవిడ నుంచున్న చోట పెల్లగా వూడిపోయి, తత్ఫలితంగా ఆమె ఆ నూతిలో పడి, మీద మన్నూ రాళ్లు పడి పోయాయట. అవన్నీ తీసి చూసేసరికి ఆవిడ చనిపోయి వున్నదట

## గ్రంథాలయాల్లో నిద్ర!

బ్రిటన్లోని పెద్ద పెద్ద గ్రంథాలయాలలో ఆశ కొద్దీ చదివెయ్యాలని పుస్తకాలను పుచ్చుకూర్చుని కునికిపాట్లుపడే వారు ఎక్కువైపోతున్నారట ఈ రకం వ్యక్తులు నిజంగా పుస్తకం చదవదల్చుకున్నవారికి ఆ పుస్తకాలు దక్కకుండా చేస్తున్నారనీ, కనుక వీరినిద్రను అరికట్టి తీరాలని నిశ్చయించుకుని, పుస్తకం చేతో పుచ్చుకుని గ్రంథాలయాలలో నిద్ర పొయ్యేవారికి యాభై పౌనులు అపరాధం విధించబడుతుందని ఓ చట్టం రూపొందించారట మరి ఇలా నిద్రపోయ్యేవారిని కనిపెట్టడానికి నియమించబడ్డవారికి జీతాలెంతెంతో ఆలోచించారో?

## థార్లో ఉప్పుగని!

రాజస్థాన్లో ఉన్న థార్ ఎడారిలో ఇసుక క్రింద సుమారు వంద కిలోమీటర్ల అడుగున ఆణి ఉప్పు కొన్ని లక్షల కోట్ల టన్నులు ఉన్నదట ఈ ఆణి ఉప్పు పొర ఎనభై వేల చతురపు కిలోమీటర్ల విస్తీర్ణంలో అయిదు వందల మీటర్ల మందాన్న ఉన్నదట ఈ విషయం భారతదేశ భూగర్భ పరిశోధనా సంస్థ డైరెక్టరు డా వి ఎస్ కృష్ణస్వామి అన్నారట ఈ ఉప్పు తీయడానికి ఖర్చెంతవుతుందో! ఆ ఉప్పు చౌకా—ఇలా ఖర్చే వ్వాకా!!

## కార్ల ఎగుమతిలో జపాన్!

జపానుకు చెందిన టయోటా అనే కార్లకంపెనీ పోయిన నవంబరు నెలలో ఒక లక్షా నలభై ఒక్క వేల ఆరొందల డెబ్బయి కార్లు తయారు చేసి ఎగుమతి చేసిందట మరో కార్లకంపెనీ నిస్సాన్ అది నవంబరులో 'డాట్సన్' అనే పేరు గల 1, 15, 486 కార్లను ఎగుమతి చేసిందట పెట్రోలు అసలే లేని యీ రోజుల్లో యిన్ని లక్షల కార్లేల!

మోసం కాదు బాబూ! నిన్ను భర్తగా పొందాలని స్వామికి మొక్కుకుందట నిన్ననే తిరుపతి వెళ్ళొచ్చింది!! జుట్టిస్తానన్నదట పెట్టు నాయనా

సీరియల్

# రాగలహరి

శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

(గత సంచిక తరువాయి)

**జరిగినకథ—11 :** ఆదర్శ దాంపత్య జీవితం సాగిస్తున్న చరణ్, పల్లవిలకు సంవత్సరాలు గడుస్తున్నా పిల్లలు కలగక పోవటంతో, బంధువుల దృష్టంతా వాళ్ళ మీదే వుండేది. కొంత కాలానికి పల్లవికి 'గొడ్రాలు' అన్న పేరు స్థిరపడి పోయింది. ఓ శుభ ముహూర్తాన ఆమె కడుపు తోందన్న వార్త ఆ దంపతులను ఆనంద పరచినా, బిడ్డ చేత్తుకునే వరకూ నమ్మకం లేదేమో! అన్న అనుమానం వాళ్ళని విచార సాగరంలో ముంచేత్తుతూ వుంటుంది. చరణ్ పల్లవిలకు పుట్టిన పాపకు 'శృతి' అని పేరు పెట్టుకొంటారు. చరణ్ కి ప్రమోషన్ రావటంతో చాలా బిజీ అయి పోతాడు. డ్రామాలో బాగా యాక్టింగ్ చేసిందని శృతిని అందరూ మెచ్చుకుంటుంటే, ఆమె కన్నతండ్రి చరణ్ రాక పోవడం తీరని వ్యధకు గురి చేస్తుంది పల్లవిని. పల్లవి మళ్ళీ గర్భవతి అయిందని తెల్సిన చరణ్ కి లోగడ డాక్టర్ చెప్పిన విషయం గుర్తుకు వస్తుంది. అతని మనస్సు పరి పరి విధాల ఆలోచిస్తూంటుంది. పాపను కన్న పల్లవి ప్రాణం పోవడంతో చరణ్ పిచ్చివా డవుతాడు. ఇక శృతి పరిస్థితి వర్ణనాతీతం. పల్లవి మరణానికి కృతే కారణంగా భావించిన చరణ్, ఆపాప ప్రసక్తి వస్తేనే కోపంతో మండిపడుతుంటాడు. చరణ్ ఇప్పుడిప్పుడే కోలుకొంటుంటాడు. శృతి తన పనులు తాను చేసుకోవటమే గాక పాప పనులన్నీ తనే చేస్తుంటుంది. తమ ఎదురింట్లోకి క్రొత్తగా వచ్చిన గీతికతో పరిచయం పెంచుకొంటుంది శృతి. గీతికను ఆమె సవతితల్లి చాలా హీనంగా చూస్తుంటుంది గీతిక మేనమామ సంజయ్ తో ఆమె సంసార జీవితానికి పనికిరాదని లేనిపోని అభాండాలు మోపి,తనకూతురు చంద్రికను అతనికి కట్టబెట్టాలని చూస్తుంటుంది రత్తమ్మ. చంద్రిక, సంజయ్ ల పెళ్ళికి ముహూర్తం పెట్టుకుంటారు. ఏదో ఓ సంబంధం చూసి గీతికకి ముడి పెట్టాలని చూస్తున్న రత్తమ్మ ఓనాడు వేదాంతంగారితో గీతికని చరణ్ కిద్దామని చెప్పగా, మండి పడతాడాయన. తన మామయ్యను తనకు కాకుండా చేసింది రత్తమ్మేనని తెలుసుకున్న గీతిక ఆమెను నిలదీసి అడుగగా, గీతికను కొట్టి, గదిలో బంధించుతుంది.

"తల్లీ గీతికా! అమ్మా! ఇటురా తల్లీ ... నేనూ నీ పరిస్థితికి లోపల ఏడుస్తున్నానమ్మా ... నేను నిజంగా అసమర్థుడినే ... అయినా ... సంజయ్ ఎందుకట్లా మారాడో నమ్మా ...అడుగుదామనుకున్నాను..."

"నాన్నా! మోసం నాన్నా! ఇదంతా ఆవిడ చేసిన మోసం ..." అని అంతా చెప్పింది తండ్రికి.

"నాన్నా! జబ్బేమిటి నాన్నా! ఇదేం పుకారు ? మీరే చెప్పండి ? ఇది మంచి పనేనా ? తన కూతురికి పెళ్ళి చేసుకోడానికి, ఇంత ఘోరం చేస్తుందా ఆవిడ ? అదే కన్న కూతురైతే ఇట్లా చేసేదా ?" కళ్ళ నీళ్ళు ఉబికి వచ్చాయి.

ఆయనకీ కన్నీళ్ళొచ్చాయి.

"ఇదంతా నా వల్లనే తల్లీ ! నేనసలు రెండో పెళ్ళి చేసుకోకుండా వుంటే ఎంత బావుండేది ? దేవత లాంటి మీ అమ్మకీ, ఈవిడకీ ఎంత తేడా వుంది? ఇప్పుడేమనుకునీ ఏం లాభం ? సంజయ్ నే అడుగుదామనుకొన్నాను, ఎందుకు గీతికని వద్దన్నావని. అసలు ఆవిడ పడనివ్వందే, నేనేం చేసేది ? కానీ, తల్లీ నీకు జబ్బని ఈవిడ ప్రచారం చేస్తోందని, నాకు తెలీనే తెలీలేదమ్మా ! నాకివాళే, ఇప్పుడే, నువ్వు చెప్తేనే తెలిసింది. ఇవన్నీ వింటుంటే తల్లీ ... నేను ఇంకా ఎందుకు బతికున్నానా అని ఏడుస్తున్నాను"

"ఎందుకు నాన్నా ! మనం ఇంత బాధ పడడం ? దీనిని మనం ప్రతిఘటించలేమా? మీరు నా వెనక వుంటే నేను అన్నిట్నీ ఎదిరించగలను. అన్యాయాన్ని—అన్యాయమని తెలిసీ మనం ఎందుకూరుకోవాలి ? మీరడగండి. లేకపోతే నేనడుగుతాను, నలుగురి ఎదుటా."

అంతలో రత్తమ్మ వచ్చింది.

"ఏమిటి, తండ్రీ కూతుళ్ళమంతనాలు?"

"మంతనాలు కాదే.. నిన్నూ..." పళ్ళు పటపట కొరుకుతూ ఆయన లేచాడు. ఆవిడ తొణకలేదు, బెణకలేదు మొగుడు ఆవిడ చేతిలో కీలుబొమ్మ. అయన్నెట్లా లొంగదియ్యాలో ఆవిడకి బాగా తెలుసు.

"ఏమిటి ? మీకేమన్నా మతిపోయిందా ? పెళ్ళివారవతల వస్తున్నారు. మనం వెళ్ళి వాళ్ళకి కావలసినవి చూడద్దూ ? పావుకోళ్ళున్నాయో, లేదోనని గదిలోకొచ్చి చూస్తేనని ఇక్కడే కూర్చుంటే ఎట్లా ? అవతల బోలెడు పనులు. ఒక్కదాన్ని ఎక్కడ తిరగను? అడపనికీ, మొగపనికీను !"

పెళ్ళి వారొస్తున్నారంటే కాస్త తగ్గాడు, వేదాంతంగారు.

"అయినా, అదేమిటే ! గీతికకి జబ్బని పుట్టించావుట ? తప్పు కదూ ? నీకిదేం పాడుబుద్ధి ? ఒక పిల్లని ఉసురు పెట్టి ఈ పెళ్ళి చేసినా, నీ కూతురు సుఖ పడుతుందనే అనుకున్నావా ?" అన్నాడు కాస్త తీవ్రంగానే.

"చాల్లెండిసంబడం. నేనేంపుట్టించలేదు. అసలు ఎవరన్నారో, ఎవరు విన్నారో, నాకేం తెలీదు" అనేసింది ఆవిడ.

"అమ్మో ! ఒక్కసారిగా ఎంత అబద్ధమాడేసిందో." అప్రయత్నంగా గీతిక చేతులు గుండెలమీదికి వెళ్ళాయి.

తన చెవులతో తను విన్నది. ఎట్లా నమ్మకుండా వుండగలదు ?

"ఏమిటి ? మీరొస్తున్నారా ఇడిదికి, లేదా ? ఈ మహారాణీగారు కోపగృహం విడిచిరాదు ఇంక అన్నిపనులకీ నేనే చావాలి...' విసవిసా నడిచి వెళ్ళిపోయింది.

"వస్తాను తల్లీ ... నువ్వేం అధైర్య పడకు. అన్నీ మన మంచికే అనుకుందాం."



గీతికని సందిగ్ధావస్థలో వదిలి తండి వెళ్ళిపోయాడు!

విక్షిప్తంగా వుండిపోయింది గీతిక. తను ఒంటరిది. నిజంగా ఒంటరిది.

"ఆంటీ! మీరిక్కడ కూర్చున్నారా? నేను ఇల్లంతా వెతుకుతున్నాను, మీ కోసం."

"ఇవాళ మీ ఇల్లెంత బావుందో! పాపని కూడా తీసుకువచ్చాను చందక్క ఎంతందంగా వుందో, పెళ్ళంటే ఏమిటి ఆంటీ ..."

శృతి వచ్చి చనువుగా గీతిక వళ్ళో కూర్చుంటూ అడిగింది. గీతిక మౌనంగా వుండడం చూసి, ఆశ్చర్యంగా ఆమె మొహంలోకి చూసింది

కన్నీరు తుడుస్తూ – "ఆంటీ ... ఏడుస్తున్నారా, ఏందుకు?" ముద్దుగా అడిగింది. సమాధానంగా ఆ పిల్లని గట్టిగా హృదయానికి హత్తుకుంది గీతిక.

* * *

భర్త ఆ గదిలోంచి బయటికి రాంగానే ఆయన్ని తన మాటలతో మంచి చేసుకుంది రతమ్మ

"చూడండి. ఇప్పుడు సంజయ్‌తో ఏమన్నా మాటాడితే, ఈ పెళ్ళి ఆగిపోవచ్చు. దాంతో ఇంక మన చంద్రికకి పెళ్ళి కాదు, ఈ జన్మలో! పీటలమీది దాకా వచ్చి ఆగిపోతే, ఆ పిల్లని ఇంక ఎవరు చేసుకుంటారు. మీరే చెప్పండి. నిజానికి ఎవరో, అమ్మలక్కలు కల్పించినవేగాని, నిజం కాదు. నేనట్లా అంటానా మన పిల్లని గురించి? అసలు మీరెట్లా నమ్మారని? దానికి తనకు కావల్సిన సంబంధం కాకుండా పోయిందనే దుగ్ధ వుంటుంది, సహజం. కానీ, ఏం చేస్తాం? ఇందులో మన తప్పేంవుంది? అది మన ప్రారబ్ధం. ఈ పెళ్ళి జరిగిపోయే దాకా దాన్ని ఒంటరిగా వదిలేస్తే, ఆ తరువాత కొన్నాళ్ళు కాస్త అదే సర్దుకుంటుంది. అందుకనే దాన్నంత ఎక్కువగా నేను పలకరించడం లేదు."

ఈ మాటతో ఆయన పూర్తిగా చప్పబడిపోయాడు!

## 24

చరణ్ మామూలుగానే ఆఫీసు పని చూసుకుంటున్నాడు.

ఒకసారి చరణ్ క్యాంపు వెళ్ళాల్సివచ్చింది. పల్లవి పోయాక పిల్లలిద్దర్నీ వదిలి దూరం వెళ్ళడం ఇదే ప్రథమం చరణ్‌కి. రాజమ్మ – రాముా "ఏం భయంలేదు మీరు వెళ్ళిరండి. మేము చూసుకుంటాము పిల్లల్ని" అని ధైర్యం చెప్పారు.

మద్రాసులో జరిగిన ఒక సంఘటన వల్ల చరణ్ జీవితంలో ఒక మలుపు ఏర్పడింది. మద్రాసులో ఈసారి హోటల్లో వుండకుండా ఒక ఫ్రెండ్ ఇంట్లో వున్నాడు చరణ్.

ఆ రోజు శనివారం. వచ్చిన పనయిపోయింది. ఇంక వెళ్ళిపోవాలి. రైలులో రిజర్వేషన్ దొరకలేదు. ఏ రోజు పనవుతుందో తెలీక ముందుగా రిజర్వేషన్ చేసుకోలేదు చరణ్. ఆ రోజుకి అక్కడే వుండిపోవాల్సి వచ్చింది

చరణ్ ఫ్రెండ్ కిరణ్, అతడి ఫామిలీ ఎంతో ఇదిగా చూసుకుంటున్నారు చరణ్‌ని. అతడికో రూము ఇచ్చేశారు. అతిథి మర్యాదలు అపూర్వం. ఎక్కడికి వెళ్ళాలన్నా తమ కారు వాడుకోమంటున్నారు. చాలా సౌకర్యంగా వుంది చరణ్‌కి.

సాయంత్రం అయిదు గంటలకి కిరణ్ రెడీ అయి బయటికి వెళ్ళబోతూ, చరణ్ వున్న గదిలోకి వచ్చాడు. చరణ్‌కి ఏమీ తోచక పరధ్యానంగా కిటికీలోంచి బయటికి చూస్తూ కూచున్నాడు.

ఆకాశం వర్ణ చిత్రం గీయబోయే ముందు వుండే కాగితం లాగా నిర్మలంగా వుంది పక్షులు తమ గూళ్ళకు చేరే హడావిడిలో వున్నాయి. పల్లవి పదేపదే గుర్తుకువస్తోంది. మనసు అశాంతిగా వుంది. తనకు మతి

# రా గ ల హ రి

భ్రమించినప్పుడే బావుండేదేమో చేతనా వస్థకు వచ్చినప్పటి మంచి బాధే!

"చరణ్! ఏం చేస్తున్నావు?" అంటూ కిరణ్ వచ్చాడు లోపలికి

"మద్యా కిరణ్, రా రా"

"ఏకివాళేం పని లేదుగా?"

లేదన్నట్టు తలూపాడు

"నేను ఒక మీటింగుకి వెళ్తున్నాను, నువ్వు కూడా వస్తావా?" కిరణ్ అడిగాడు కుర్చీలో కూర్చుంటూ

"ఏం మీటింగ్ కిరణ్?" యధాలాపంగా అడిగాడు.

"జిడ్డు కృష్ణమూర్తి గారి పేరు విన్నావా?"

"అవును— విన్నాను— ఆయన గురించి" అన్నాడు చరణ్ కుతూహలంగా

"ఆయన టాక్ వుందివాళ, వసంత విహార్‌లో నేను వెళ్తున్నాను నువ్వుకూడా వస్తావా వెళ్దాం?"

ఇప్పుడేమీ తోచడంలేదెట్లాగో —కాసేపు వెళ్లివస్తేసరి అనుకున్నాడు

"ఎంతసేపు వుండచ్చు టాక్?"

"ఒక గంట, గంటన్నర వుంటుంది"

"సరే వస్తాను నేను కూడా" లేచాడు చరణ్

రెడీ అయి వచ్చాడు ఇద్దరూ కలిసి బయలుదేరారు వసంత విహార్‌కి వచ్చారు అడయార్, గ్రీన్‌వేస్ రోడ్డులో వుంది [illegible] పెద్ద వేదిక కట్టబడి వుంది వందలాది జనం ఆసీనులయి వున్నారు వారిలో చాలా మంది పెద్ద పెద్ద వారే వ్యాపారవేత్తలు, రాజకీయ నాయకులు, ఫారినర్సు, విద్యా వేత్తలు, వైద్య విజ్ఞానులు, శాస్త్ర విజ్ఞానులు, యూనివర్సిటీ విద్యార్థులు, కళాకారులు, స్త్రీలు, పురుషులూ అంతా వున్నారు

వీళ్లు వెళ్లిన మరో పది నిమిషాలకి, అంతటా నిశ్శబ్దం ఆవరించింది

ఆ తరువాత—

అందరి దృష్టి తిరిగిన వైపు తిరిగాయి చరణ్ కళ్ళు గూడా

తెల్లని ధోవతి, ఎల్లో లాల్చీ, ఫేన్సీ కోటుతో, తెల్లని నెరిసిన జుట్టుతో, గంభీరంగా నడిచి, ఒక ఆజాను బాహువు ప్రవేశించారు అక్కడికి

ముఖంలో మంచి తేజస్సు, వర్చస్సు వేదిక మీదికి ఎక్కబోతూ— సభా ముఖంగా తిరిగి అందరికీ నమస్కరించారాయన

అప్రయత్నంగానే తనూ చేతులు జోడించాడు చరణ్

ఆయనవైపు చూడంగానే— హృదయం ఝల్లుమంది చరణ్‌కి! ఏదో సంచలనం బయలు దేరింది అతడిలో

ఆ కళ్ళు ఎంత నిర్మలంగా వున్నాయి! ఎంత ప్రశాంతంగా వున్నాయి! మూర్తీభవించిన కరుణంతా ఆ కళ్ళల్లోనే వుంది! ఏదో అతీతమైన ఆకర్షణ వుంది ఆ






## బధిరుల భాష

లోరి ఒక చెవిటి పిల్ల. ఆమెకు యూరప్‌లో జరిగే చెవిటివారి ఒలింపిక్ క్రీడలలో పోటీ చేయాలన్న ఆశ కలిగింది. అది ఆ బాలికకు అసాధ్యమనిపించలేదు. మామూలు పిల్లలు చదివే రూజ్వెల్టు జూనియర్ హైస్కూల్లో ప్రవేశం సంపాదించ గలిగిన ఈ చెవిటి పిల్లకు చెవిటివారి కోసం ఏర్పాటు చేసిన ఒలింపిక్ క్రీడలలో పాల్గొనటం అంత కష్టమేమీకాదు. రూజ్వెల్టు జూనియర్ హైస్కూలులోని ఇతర సాధారణ బాల బాలిక లతో ఈ పిల్ల కలిసిమెలిసి ఉండగలుగుతున్నది.

ఈమెకు స్కూల్లో చాలామంది బధిరేతర మిత్రులున్నారు. ఈమె చేతి సైగలద్వారా వారితో సంభాషిస్తుంది. తన మిత్రులు ఈమె సైగలను బాగా అర్థం చేసుకొనగలరు. చేతిసైగలతోనే బధిరేతరులు కూడా ఈ బధిర బాలికతో సంభాషించ గలరు.

ఈ స్కూల్లో జానెట్ జిబెలి అనే ఒక టీచరు ఉన్నది. ఈమె చెవిటి పిల్లలకు మాత్రమే కాకుండా ఇతర పిల్లలకు కూడా చేతి సైగలతో చదువు చెబుతుంది. ఈ స్కూల్లో చేతి సైగలతో మాటాడటం అభ్యసించే ఒక ప్రత్యేక బోధనాంశం (ఆప్షనల్ సబ్జెక్ట్) ఉన్నది. "టాక్ విత్ యువర్ హాండ్స్" అని ఈ సబ్జెక్టుకి పేరు.

చేతులతో, వేళ్లతో, శరీరంతో, కంఠ ధ్వనులతో మాటాడటంలో ఈమె శిక్షణ ఇస్తుంది. చెముడు లేని విద్యార్థులు సైతం ఈ శిక్షణ పొందుతున్నారు. "మాకు చెవిటి వారితో కలిసి మెలిసి ఉండాలని ఆశ" అంటారు, ఈ బధిరేతర విద్యార్థులు.

[యు. ఎస్. ఐ. సి]

## రా గ ల హ రి

కళ్లల్లో! ఆ కళ్లల్లో ప్రేమ- వాత్సల్యం నిండుగా వున్నాయి! నెమ్మదిగా, మృదు గంభీరంగా, ఆంగ్లంలో మొదలు పెట్టా రాయన తమ ఉపన్యాసాన్ని.

ఆ ఉచ్చారణ, ఆ మాట్లాడే తీరు ఎంత వితరణగా వుంది! ఎంత వినరంగా వుంది!

క్రమ క్రమంగా అందరూ ఆ ఉపన్యా సంలో లీనమయిపోయారు. చరణ్ తనను తాను మర్చిపోయాడు తను ఎక్కడున్నదీ మర్చిపోయి, మరోలోకంలోకి వెళ్ళిపోయాడు చరణ్. ఆ లోకం తనకు తెలియనిది, కొత్తది! ఆ నారాయణ్ణి మూర్తిని తను చూడలేదు. ఆ శ్రీరాముణ్ణి తను చూడ లేదు. ఆ చిన్ని కృష్ణుని తను చూడలేదు. ఆ బుద్ధ భగవానుణ్ణి తను 'చూడలేదు. ఆ జీసెస్ క్రైస్టుని తను చూడలేదు.

కానీ- భగవంతుని ప్రతిరూపమయిన కరుణ—ఆ కరుణ అంతా, ఆయన కళ్లల్లో ఇప్పుడు తను చూస్తున్నాడు! అదే భగవంతుడు. కరుణే దైవం!

అవును!

'ప్రేమ' అనే రెండు అక్షరాల్లో, ఎంత భావం ఇమిడి వుంది! ఆ రెండు అక్షరాల పదం ఆయన ఉచ్చరిస్తున్నప్పుడు ఆయన కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

వింటున్న చరణ్ కళ్ళ వెంట గూడా అప్రయత్నంగా నీళ్లు తిరిగాయి. ఆయన చెప్పిన ప్రతి మాటా చరణ్ హృదయంలో నాటుకు పోయింది.

"... ... ... అనుబంధం మనిషికీ- మనిషికీ మధ్య వున్నదని మనము భ్రమిస్తాం. నిజానికి ఒక మనిషి- ఎదుటి మనిషి నించీ ఏదో స్వలాభం పొందుతున్నంత కాలం— ఆ అనుభవం వున్నదనే అనుకుంటాడు. అదే అతడి స్వార్థానికి ఉపయోగించుకుంటాడు. ఆ స్వలాభానికి— ఏ విధమైన అంతరాయ మైనా కలిగితే— దానిని ధైర్యంగా ఎదుర్కో లేడు. అదే అతడి బలహీనత. ఆ బలహీనత అనేది— తనను తాను అర్థం చేసుకోలేక పోవడం వలన కలుగుతుంది......"

ఆయన చెప్పింది ఎంత నిజం! అదిప్పుడే తెలుసుకున్నాడు తను! కనురెప్ప మూస్తే— ఆ మూర్తి తనకు కనబడదేమోనన్నంత దీక్షగా— ఆయన వైపే చూస్తూ- అంతా శ్రద్ధగా విన్నాడు చరణ్. గంటన్నర కాలం, ఎట్లా గడిచిపోయిందీ, తనకి తెలియనే లేదు. కృష్ణజీ- తన ఉపన్యాసాన్ని ముగించి- మౌనంగా స్టేజి దిగి- వెళ్లి పోతుంటే ఆయననే చూస్తూ నిలబడిపోయాడు చరణ్. ఆయన తన కనుమరుగయ్యేదాకా అట్లా చూస్తూనే వున్నాడు.

ఇవాళెంత సుదినం అనుకున్నాడు. ఇంటికి వస్తూ కిరణ్‌కి ఎన్నోసార్లు తన కృతజ్ఞతలు తెలిపాడు చరణ్. తనకొక మహామహుని దర్శన భాగ్యం కల్గించినందుకు, అంత చక్కటి ఉపన్యాసాన్ని వినడానికి అవకాశం కలిగించినందుకు, మరీ మరీ కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

కిరణ్ నవ్వుతూ— "ఈ పరిస్థితి నా కర్థమయింది. అందుకే రమ్మని పిలిచాను" అన్నాడు.

ఆ రాత్రి నిద్ర కుపక్రమిస్తూ, కృష్ణజీ ఉపన్యాసాన్ని చర్విత చర్వణం చేసుకోసాగాడు చరణ్, ఆయన చెప్పింది.

# నెస్టమ్ శిశువు జీర్ణానికి మంచిది






మీ పాపకు 4 నెలలు వచ్చినప్పటి నుంచి నెస్టమ్ బేబీ సిరియల్ రైస్ ఇవ్వండి. ఇందులో 11 విటమిన్లు, ఇనుము సమృద్ధిగా ఉన్నాయి.

బియ్యం నుంచి తయారయిన సీరియల్ జీర్ణం చేసుకోడానికి సులభమయినది.

నెస్టమ్ ప్రయోజనాలు అనేకం

పాలతో నెస్టమ్ యివ్వడం ప్రారంభించండి. పాప పెరుగుతూ వుంటే, ఆహారంలో నెస్టమ్ ఉడకబెట్టిన పండ్లు, పండిన మరియు మెత్తగా చేసిన కాయగూరలు పప్పులతో పలురకాలుగా ప్రవేశపెట్టండి.

## నెస్టమ్®
## బేబీ సీరియల్
## రైస్

తయారు చేయడం సులభం



ముందుగ మరిగిన వెచ్చని పాలు పోయండి



నెస్టమ్ చేర్చండి కలపండి



తినిపించుటకు తయారు




SAA/FSL/N/1863 TEL

"పల్లవినుండి నేను ఆమె ప్రేమని, అ మానాన్ని పొందాను. అందాన్ని అనుభవించాను. సేవలు చేయించుకున్నాను. అన్నీ లాభాలే పొందాను. అవన్నీ నా స్వార్థానికే ఉపయోగించాయి.

అదే అనుబంధ మనకున్నానా? ఆమె ఇప్పుడు లేదు. నాకు ఆనందాన్ని ఇవ్వలేదు. అన్నం వండి పెట్టలేదు. సేవలు చేయలేదు. ఇవన్నీ నాకు కరువయ్యాయి. కాబట్టి మా మధ్య అనుబంధం లేదా? అనుబంధం ఇంకా మిగిలివుంటే — నాకీబాధ ఎందుకు? ఆమెనాకు ఇవ్వాల్సిన సుఖాలు, నేను పొందాల్సిన వసతులు, నాకు దూరమయ్యాయని, నేనీబాధ భరించలేకుండా వున్నానా? అది నా బలహీనతా? అసలు పల్లునేను ఎంతవరకు అర్థంచేసుకున్నాను?"

ఇట్లా ఇవన్నీ ఆలోచిస్తూనే వున్నాడు చాలా సేపు.

కళ్ళు మూసుకుంటే కృష్ణజీ రూపమే ప్రత్యక్షమయింది.

ఎనభై ఏళ్ళు పైబడిన వారయినా, ఆయన

# రాగలహరి

మనసూ - మాటా ఎంత వుత్తేజకరంగా వున్నాయి!

ఎంతటి మహామనిషి ఆయన!

చిత్రమైన హాయి మనశ్శాంతి కలిగాయి చరణ్‌కి.

అలౌకికానందంతో సంతృప్తిగా నిద్ర పోయాడు, ఆ రాత్రి చరణ్.

* * *

ఆ తరువాత రోజుకూడా కృష్ణజీ 'టాక్' వుందని తెలిపి ఎంతో సంతోషించాడు చరణ్. ఊరికి వెళ్ళకుండా ఆరోజు కూడా వుండిపోయాడు.

కిరణ్‌తో - కృష్ణజీ గురించి అతడికి తెలిసిన వివరాలన్నీ తెలుసుకుంటూ — మాట్లాడుతూ - వుండిపోయాడు పగలంతా.

ఆరోజు ఆదివారమే కావడంతో కిరణ్ గూడా తీరుబడిగా వున్నాడు.

కృష్ణమూర్తిగారు అసలు తెలుగు కుటుంబంలో మదనపల్లిలో — పుట్టారనీ — ఆయనను చిన్నతనంలోనే అనిబిసెంట్ పెంచుకున్నదనీ — ఆవిడతోనే ఇంగ్లండు వెళ్ళిపోయిన కృష్ణజీ అక్కడే చదుకుని వుండిపోయారనీ — మన దేశంలోనూ, ఇతర దేశాలలోనూ ఆయన కొన్ని ప్రత్యేక పాఠశాలలు స్థాపించారనీ — అవి— మనదేశంలో ఆంధ్రప్రదేశ్‌లోని ఋషీవాలీలోను — వారణాశిలోనూ — మద్రాసు — బెంగుళూరులలోనూ వున్నాయన్నీ—విదేశాలలో ఇంగ్లండు, అమెరికా, కెనడాలలోనూ వున్నాయని తెలుసుకున్నాడు చరణ్.

ఆయన ఉండటం ఎక్కువకాలం విదేశాలలోనే అయినా — సంవత్సరంలో మూడు నెలలకాలం మనదేశంలో గడుపుతారనీ—ఢిల్లీ, బొంబాయి, బెనారస్, మద్రాసు, ఋషీవాలీలలో ఉపన్యాసాలిస్తారనీ చెప్పాడు కిరణ్.

కిరణ్‌నడిగి — ఆయన ఢిల్లీ, బొంబాయిలలో — ఉపన్యాసాలిచ్చే ప్రదేశాల అడ్రసులు తీసుకున్నాడు చరణ్.

ఆయన ఇచ్చే ఉపన్యాసాలన్నీ — పుస్తకరూపాలుగా కృష్ణమూర్తి ఫౌండేషన్ వాళ్ళు

# రాగలహరి

అచ్చు వేయిస్తున్నారనీ, టేప్స్–కెసెట్స్–రికార్డుల రూపంగా విడుదల చేస్తున్నారనీ సినిమాగాకూడా తీస్తున్నారనీ చెప్పాడు కిరణ్.

అవేగాక ఆయన చాలా పుస్తకాలు కూడా స్వయంగా వ్రాశారని తెలుసుకున్నాడు చరణ్. ఆయన పుస్తకాలు తను కొన్ని కొనుక్కుంటానన్నాడు చరణ్.

టాక్స్ — ఉన్నచోటే 'బుక్‌స్టాలు' వున్నదనీ — కావాలంటే పుస్తకాలు కొనుక్కోవచ్చనీ చెప్పాడు కిరణ్.

రెట్టించిన ఉత్సాహంతో ఆరోజు 'టాక్'కి వెళ్ళాడు చరణ్. ముందు వెళ్ళడంవలన కాస్త ముందుసీట్లు లభించాయి.

కృష్ణాజీని ఇంకా దగ్గిరలో చూసే అవకాశం లభించింది.

క్రితం రోజులాగే ఆయన మౌనంగా నడిచి వచ్చారు. చేతిలో గొడుగువుంది.

ఆయన్ని చూస్తూనే హృదయం పులకరించింది చరణ్ కి.

ఆయన సభానమస్కారం చేసి కూర్చున్నారు. అంతటా నిశ్శబ్దం — నెమ్మదిగా మొదలు పెట్టారాయన తమ ఉపన్యాసాన్ని

ఆరోజు (సఫరింగ్) బాధ గురించి మాట్లాడడం ప్రారంభించారు.

"అసలు బాధంటే ఏమిటి ? దుఃఖం అంటే ఏమిటి ? నా కొడుకు పోయాడు— అతడి చుట్టూ నేనెన్నో ఆశలు అల్లుకున్నాను. అవన్నీ తుంచేసి నన్ను దుఃఖ సముద్రంలో ముంచేసి తను వెళ్ళిపోయాడు. నాభార్య నేనెంతో ప్రేమించిన నా భార్య నన్ను ఒంటరినిచేసి పోయింది — అంటూ ఈ విధంగా దుఃఖిస్తూవుంటారు చాలా మంది.

అసలు దుఃఖం వేరూ— దుఃఖ పడేవాడు వేరూనా ? దుఃఖం అతడిలోనే కలిసివుందా? లేదా? లేదు దుఃఖం వేరు— దుఃఖపడేవాడు వేరు అనుకుంటేనే దుఃఖం అనేది వుంది. కాకపోతే — ఆ దుఃఖమేమిటో అర్థమవుతుంది. నిజంగా అదేమిటో అర్థంచేసుకుంటే అసలు దుఃఖమే వుండదు ......"

ఎంత బాగా — ఎంతశాంతంగా చెప్తున్నారు! ఆయన అవన్నీ అట్లా చెప్తూవుంటే జీవిత సత్యాలు ఒక్కొక్కటే కళ్ళముందు కొస్తున్నాయి. బాహ్యతెరలు ఒక్కొక్కటే తొలుగుతున్నాయి.

ఆయన కళ్ళల్లోకి చూస్తూ మంత్రముగ్ధుడిలా వుండిపోయాడు చరణ్.

ఉపన్యాసం ముగిసింది. ఆయన లేచారు నిశ్శబ్దంగా నడిచి వెళ్ళారు. ఆ తరువాత కిరణ్ బుక్‌స్టాల్‌కి తీసికెళ్ళాడు చరణ్‌ని. అదొక తన్మయావస్థలో వున్నాడు చరణ్ ఇంకా—అట్లాగే కిరణ్ వెంట నడిచివెళ్ళాడు.

ఆయన రాసిన పుస్తకాలు, అనువాదాలు, అన్నీ — ఎన్నో వున్నాయి అక్కడ. ఆయన ఉపన్యాసాలకి తెలుగు అనువాదాలు కూడా వున్నాయి.

అన్నీ వివరంగా చూసి — కామెంటరీస్ ఆన్ లివింగ్ — మూడుభాగాలు, 'దిస్‌మాటర్ ఆఫ్ కల్చర్' 'ది ఫస్ట్ అండ్ లాస్ట్ ఫ్రీడమ్' అనే పుస్తకాలు కొనుక్కున్నాడు చరణ్.

కొన్ని తెలుగు అనువాదాలు కూడాకొన్నాడు. అవి కొన్నప్పటినుంచీ చదివేయాలనే తొందర ఎక్కువైంది అతడిలో.

ఆ తరువాత ఇంటికి తిరిగివెళ్ళి—కృష్ణాజీ పుస్తకాలు చదువుతున్న కొద్దీ అతడిలో చాలా మార్పులు రాసాగాయి.

* * *

కృష్ణాజీ పుస్తకాలు చదివి అర్థం చేసుకుంటున్నకొద్దీ అతడిలో కొత్తకొత్త ఊహలు చెలరేగసాగాయి.

ఇప్పుడు కృతిని ఎంతో ప్రేమగా చూస్తున్నాడు. చాలా సమయం పిల్లలతోనే గడుపుతున్నాడు. వాళ్ళకి ఆత్మీయత — ఆప్యాయత సమానంగా ఇవ్వడం ప్రారంభించాడు.

కృతి కనిపెట్టింది. ఆ పాప సంతోషానికి మేరలేదు. రాజమ్మనీ — రాముని — చూడడంలో కూడా తేడా స్పష్టంగా కనబడుతోందిప్పుడు !

అప్పటికంటే గూడా ఎంతోఅభిమానంగా మాట్లాడుతున్నాడు. వాళ్ళ యోగక్షేమాల్ని విచారిస్తున్నాడు.

కరుణ పూరితమైన కృష్ణాజీ కళ్ళు— ఆ చూపు చరణ్ ని వెంటాడుతూ — అతణ్ణి పూర్తిగా మార్చేసినాయి !

(ఇంకా వుంది)

స్పందన ఐపోగానే
రాగబంధితులు
సీరియల్ ప్రారంభం !

# ఇన్‌క్రిమిన్ బాలలు

## కేవలం పెద్దగా కాదు, ఎంతో చక్కగా పెరిగే పిల్లలు!




ఇన్‌క్రిమిన్ టానిక్ పెరిగే వయసులో ఎంతో పెద్ద...పెద్ద తేడాను తెస్తుంది. నిజానికి అసలు విషయం ఏమిటంటే ఇన్‌క్రిమిన్ టానిక్ ఇతర టానిక్‌లకన్న ఓ మెట్టు పైనుంది. ఎందుకంటే, ఆరోగ్యమైన పెరుగుదలకోసం అత్యవసరమైన విటమిన్లతోపాటు ఇన్‌క్రిమిన్‌లో లైసిన్ కూడా ఉంది గనక. ఆ లైసిన్ ఆకలిని పుట్టిస్తుంది. పిల్లలు చక్కగా పెరగాలంటే బాగా తినాలన్న మాట ప్రతి తల్లికీ తెలుసు. ఈ ఇన్‌క్రిమిన్ అలా బాగా తినే ఆహారాన్ని మేలైన పెరుగుదలకు తోడ్పడేలా మారుస్తుంది మరి.

Lederle ఉత్పాదన
* అమెరికన్ సయానమిడ్ కంపెనీవారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్.




## ఇన్‌క్రిమిన్* టానిక్

### తినే మంచి ఆహారాన్ని తీరైన పెరుగుదలగా మారుస్తుంది.

Sista's-INC-973/80 Tel F



సీరియల్

# స్పందన

మంథా వెంకట రమణారావు

(గత సంచిక తరువాయి)

మర్నాడు తెలివి వచ్చేక లిల్లీ తనకి ఏ బిడ్డ పుట్టాడని అడగలేదు తన భర్తకెలా ఉందని అడిగింది వెంటనే చెప్పడం ఇష్టంలేక పరిస్థితి ప్రమాదకరంగా ఉందని చెప్పేరు లేచి వెళ్లి రామాన్ని చూస్తానని పట్టుపట్టింది లిల్లీ ఇంటెన్సివ్ కేర్‌లో ఉన్నాడు, చూడడానికి వీలుకాదన్నారు కొడుకు పుట్టినట్టు చెప్పి, పనస పండు వంటి పిల్లడ్నితెచ్చి ఆమె ఒడిలో పడుక్కో పెట్టేర -- కాని లిల్లీకి ఉపశమనం కలగలేదు — గంట గంటకీ వచ్చిపోయే నర్సులని తన భర్త పరిస్థితి అడుగుతూనే ఉంది — వాళ్లు అసలు సంగతి చెప్పకుండా మభ్యపెడుతూనే వచ్చేరు ఆమె పరిస్థితి మెరుగ్గా అయిందని ధైర్యం కలిగాక, ఇంక దాచి లాభంలేదని, లూసీయే మధ్యాహ్నం వేళని అసలు సంగతి చెప్పింది .. "లిల్లీ డియర్! మేమంతా నీకున్నాం . నువ్వు ధైర్యం వహించాలి !"

ఆమె ముఖంలోని విచారాన్ని గమనించిన లిల్లీకి వెంటనే అనుమానం వచ్చింది "ఏమయింది ? అతను ప్రమాదం దాటేరా ? చెప్పు లూసీ !"

"లేదు లిల్లీ ! ప్రభువు అతన్ని తన దగ్గరికి పిలుచుకున్నాడు !" కంట నీటితో అంది లూసీ

"అంటే . నా భర్త మరి .!! " లిల్లీ ముఖంలో విషాదం, భయం మిళితమై ఆమె ముఖాన్ని వివర్ణం చేసేయి

"మనల్ని వదిలిపోయేడు లిల్లీ !" లూసీ చిన్న గొంతుతో అంది . ఆ మాటలు లిల్లీని అణువణువునా కుదిపేసేయి దుఃఖం సాగరంలా ముంచుకరాగా పెద్దపెట్టున ఏడవసాగింది అలా ఏడవడం వల్ల ఆమె మనసులోని షాకు తగ్గుతుందని ఆమెని అలా హృదయ విదారకంగా ఏడవనిచ్చేర

"రామాయన్ని చూపించండి !" అంది లిల్లీ లేస్తూ

ఆమెకింక ఫరవాలేదన్న నిర్ధారణ కలిగి, లూసీ, తదితరులూ ఆమెని మార్గ్‌కి తీసుకవెళ్లేరు అక్కడ నిర్జీవమైన రామం దేహం చూడగానే మరొకసారి లిల్లీ హృదయం బద్దలయింది — ఆమె జీవనజ్యోతి ఆరిపోయింది చుట్టూ అంధకారం నిజంగా ఆమెకీసారి గోచరమైంది అతడి దేహాన్ని పట్టుక అతడ్ని తిరిగి రమ్మంటూ విలపించింది

కాని ఆమె ఏడ్పు ఆ నాలుగు గోడలూ దాటి అతడి ఆత్మని చేరుకున్నా, తిరిగి ప్రాణాన్ని ఆ శరీరంలోకి ప్రవేశపెట్టలేకపోయేయి

ఇండియాకి కేబిల్‌గ్రామ్‌లు వెళ్లేయి రామం మిత్రులూ, అధ్యాపకులూ కలిసి అతడి శరీరాన్ని ఎలక్ట్రిక్ ఫర్నేస్‌లో దహనం చేయించి, అస్థికలు డాక్టర్ శ్రీనివాస్‌కి విశాఖపట్నం పంపేరు

తల్లిని వెంటనే ఇక్కడికి వచ్చీమని లిల్లీ కేబిల్‌గ్రామ్ ఇవ్వగా, శాంతమ్మ విలియమ్స్ సహాయంతో పాస్‌పోర్ట్, విసాలు ఏర్పాటు చేసుకొని, పదిరోజుల్లో అమెరికా చేరుకుంది — తల్లిని పొదవి పట్టుకొని తన దుఃఖాన్నంతా వెళ్లగక్కింది లిల్లీ — "నేనెలా బతకనే అమ్మా ! రామం లేకపోతే మరి నాకు ఈ ప్రాణం నిలబెట్టుకోవాలనే లేదమ్మా !"

శాంతమ్మ కూతుర్ని ఓదార్చింది నర్సుగా ఆమె జీవితంలో ఎన్నో చావులనీ, ఎందరో దీనాతిదీనమైన పరిస్థితులనీ చూసింది — తన కూతురుకీ ఆ అవస్థ ప్రాప్తించేసరికి దుఃఖం ఎంత కఠినమైనదో ఆమె కవగాహనయింది —

"లిలియన్ ! ప్రభువు చేసిందానికి ఎవరేం చెయ్యగలరు ? నీకింకా పాతికేళ్ళు నిండలేదు ! కాని అరవైఏళ్ల స్త్రీ చూసిన దుఃఖం చూసేవ్ ! రామం మరింక లేడు కాని ఈ ఇద్దరు కొడుకులూ నీకున్నారు వీళ్లని పెంచి, పెద్దచెయ్యవల్సిన బాధ్యత కోసమన్నా ధైర్యాన్ని కూడదీసుకోవాలి !" శాంతమ్మ మనస్సులో ఇంకా ఎన్నో ఆలోచనలున్నాయి — కాని అవి చెప్పేందుకిప్పుడు సమయం కాదు--ఆమె హిందూ స్త్రీలా వైధవ్యాన్ని భరిస్తూ జీవితం ఎడారి మయం చేసుకోడం శాంతమ్మ కిష్టం లేదు ఇది అమెరికా — కాలక్రమాన లిల్లీ తనకు నచ్చిన మగాడ్ని పెళ్లాడి సుఖంగా జీవించ వచ్చిక్కడ తనింక ఇండియా వెళ్లదు — ఇక్కడే నర్సుగా ఉద్యోగం చూసుకోవచ్చు — మనవల్ని పెంచి పెద్ద చెయ్యవచ్చు

"ఎలాగమ్మా ! నా కెవరున్నారింక దిక్కు !"

"దేవుడున్నాడు ! నే ఉన్నాను ! నేనింక ఇండియా వెళ్లనమ్మా నీతోనే ఉండిపోతాను — అక్కడి ఇల్లు అమ్మేసేయమని విలియమ్స్‌కి రాస్తాను " ఆ మాటలు లిల్లీకి ధైర్యానిచ్చేయి తల్లి ఒడిలో తలపెట్టుక కళ్లు మూసుకుంది కాని ఆమె మనసులోంచి రామం రూపం పోవటం లేదు ఎప్పటికీ పోదు !

## 38

చంపా ఈ లోకంలో ఒంటరిదయినట్టు తీవ్రంగా బాధపడింది దురదృష్టం కోరి కోరి తనని వెంటాడుతున్నట్టనిపించింది అమ్మపోయిన రెండేళ్లలో నాన్న పోవడం నాన్న పోయిన నెలరోజులు దాటేక అమితంగా అభిమానించే అన్న పోవడం ! ఇంకెవరున్నారు ఈ లోకంలో తనంటే ప్రాణం పెట్టేవారు ? తన ఇష్టాయిష్టాలు తెలుసుక అనునయంగా మాట్లాడే నాన్నమ్మా, అమ్మా, నాన్నా, రామం అన్న ప్రేమాభిమానాలు మరి తనకీ జన్మలో దొరకవు కదా ! శ్రీను అన్నయ్య ఉన్నాడు . కాని లాభం ఏమిటి ? తోబుట్టువుగా తను ఉంది కాబట్టి శోకం మరోలా అనుకుంటుందని భయపడి తన

[illegible] శాఖల — అను ఈ ఉద్యోగం వదలనని చెప్పింది ఈ ఇల్లూ వదలనని చెప్పింది.

రామం పోయాడన్న వార్త తరవాత శ్రీను వచ్చి చంపాని ఓదార్చి, విశాఖపట్నం తీసుకవెళ్లేడు... వారం దినాలు శెలవు తీసుకవెళ్లింది — కాని ఆ వారంరోజులూ అక్కడ మొహమాట పడుతూ ఉన్న ఒక అతిథిలా ఉందే తప్ప, తన అన్న ఇంట్లో ఉన్నట్టనిపించలేదు. మీనాక్షి మాటలు ఎన్నో తనకి నచ్చలేదు. ''ఆ క్రిస్టియన్‌దాన్ని పెళ్లి చేసుక ఉండకపోతే హాయిగా మంచి ఉద్యోగం చేసుకుంటూ... సంపన్నమైన, సాంప్రదాయకమైన పిల్లని చేసుకొని హాయిగా ఇక్కడే ఉండును రామం ?'' అంటూ బాహాటంగా శ్రీనుతో అన్న ఆ మాటలకి శ్రీను 'నిజమే'' అంటూ వంతపాడడం ఆమెకి ములుకుల్లా తగిలేయి.

ఒకనాడంది మీనాక్షి ... ''కూతురు దగ్గరికి శాంతమ్మ వెళ్లిపోయింది కదా...మరి తిరిగి రాదుట! ఇల్లు అమ్మమని రాసిందిట ... నాన్న చెప్పేరు ... ఆ ఇల్లు అమ్మే ఏర్పాట్లు నాన్నే చేస్తున్నారు ... పెద్దన్నయ్య కోసం కొందామనుకుంటున్నారు ... పదిహేనువేలకి ! నాన్న ఏమన్నారంటే ... రామం అక్కడ ఇరవై, ముప్ఫయివేల డాలర్ల ఇన్సూరెన్స్ చేసేరుట ... ఆ డబ్బుకి హక్కు భార్యకే గాక కుటుంబంలోని పెళ్లికాని చెల్లెల కుండదా ? మీరు వెంటనే శాంతమ్మకి ఉత్తరం రాయండి ... ఈ పదిహేనువేలూ రూపాయల రూపంలో ఉంటాయి... అక్కడికి పనికిరావు ... చంపాకి ఇస్తే ఆమెకి రామం తరఫునించి ఇచ్చినట్టవుతుంది ... కట్నం డబ్బు ఎక్కడ్నుంచి తెవడమా అన్న సమస్య కూడా తీరుతుంది !''

చంపా వెంటనే కలగజేసుకుంది...''అన్నయ్యా! నువ్వటువంటి ఉత్తరం రాయకు ! నాకు వాళ్ల సొమ్ము ఒక్క రూపాయన్నా వద్దు, వారి దుఃఖంలో వాళ్లున్నారు ! లిల్లీకి రామం అన్నయ్య ప్రాణం ! ఇప్పుడామెకేం మిగిలింది ? పిల్లల్ని పెంచి పెద్ద చెయ్యాలి కదా ? ఆమెకా డబ్బు ఎంతో అవసరం ! రామన్నయ్య ప్రాణం పోగా వచ్చిన డబ్బులోంచి నా భావికోసం పునాదులు వేసుకోలేను !'' అంటూ ఖచ్చితంగా చెప్పడంతో మీనాక్షికీ, చంపాకీ మధ్య మంచులా గట్టిపడింది — చల్లబడింది అనుబంధం.

తిరిగి వచ్చేస్తున్నప్పుడు శ్రీను ఒకటి రెండు పెళ్లిచూపుల తంతు ఏర్పాటు చేసేడు చంపాకి. ఆ రెండు సంబంధాలూ కుదరలేదు. వచ్చేరు ... పిల్లని చూసుకున్నారు ... వారికి నచ్చితే తను ఏమీ అభ్యంతరం పెట్టదలచుకోలేదు చంపా. ఒకబ్బాయి నల్లగా పొట్టిగా ఉన్నాడు — ఏ. వీ. ఎన్. కాలేజీలో లెక్చరర్‌గా ఉన్నాడు ... ఆ రోజుల్లో నెలకి నాలుగొందలు ... పైన ట్యూషన్లుంటాయిట ... పదివేలు కట్నం ... లాంఛనాలు ... వారి కనీస డిమాండ్లు. అందుకు తయారయ్యేడు శ్రీను. పాతఇల్లు అమ్మేస్తేసరి ... అనుకున్నాడు. పిల్ల జాతకం తిరగేయించి ఏవో దోషాలున్నాయనీ, ప్రస్తుతం ఆమె గ్రహస్థితి బాగుండక పోవడం వల్లే ఆ కుటుంబంలో ఇన్ని విపత్తులు వచ్చాయనీ అన్న జ్యోతిష్కుడి మాటలని వేదవాక్కుల్లా నమ్మి, చంపా తమకి నచ్చలేదన్నారు. ఒక జ్యోతిష్కుడు మానవ జీవితాలతో చెలగాటాలాడగలగడం చంపాకి వింతగా తోచింది — నాన్న తన జీవితంలో ఎప్పుడూ తన జ్యోతిష్యాన్ని ఒకరి మంచి కోసమే వాడేరు తప్ప ... ఇలాటి విపరీతార్థాలు ఏనాడూ తియ్యలేదు! మనిషిలోని పిరికితనాన్నీ, భావి అంటే భయాన్నీ తను స్వార్థం కోసం వాడుకుంటారీ జ్యోతిష్కులు అనిపించింది చంపాకి.

రెండో సంబంధం కుర్రాడు తెల్లగా ... సన్నంగా ఉన్నాడు ... పి. డబ్ల్యూ. డీలో ఇరిగేషన్ శాఖలో ఓవర్సీరు ... బాగా పైన దొరుకుతుందిట జీతం కాక. వాళ్లకి పిల్ల నచ్చింది. కాని వాళ్లు పదిహేనువేలు కట్నం ముందే రొక్కం ఇచ్చి మన్నారు. లాంఛనాలూ ... పెళ్లిఖర్చులూ అదనం. ఆ పదిహేనువేలూ అబ్బాయి చెల్లెలుకి కట్నం కింద ఫిక్స్‌డ్‌లో పడేస్తారుట ... వాళ్ల లెక్కలు వాళ్లు చెప్పేరు. జాతకం పట్టింపులు వాళ్లకి లేవు...డబ్బు పట్టింపు తప్ప. వాళ్లది పెద్ద సంసారం...ఒక్కడే కొడుకు ... నలుగురు ఆడపిల్లలు ... ''ఎందు కన్నయ్యా అంత కట్నం ఇమ్మకొని అవస్థపడ్డం ! నా పెళ్లి జరగవల్సినప్పుడు జరుగుతుంది! పెళ్లంటే నాకు భయం పట్టుకుంది ! పిల్లలూ...సంసారం... కష్టాలూ !''

''ఆడపిల్లన్నాక పెళ్లీ, సంసారం తప్పదు కదే చంపా ! ఏదన్నా సంబంధం కుదిరితే నువ్వు కాదన కూడదు ...'' శ్రీను తన బరువు వదిలించు కోవాలని అన్నాడు.

''నీ ఇష్టమే నా ఇష్టం అన్నయ్యా !'' చంప మరి వాదించదలచుకోలేదు ! ఈ జీవవాహినిలో నీటి

...పిగలా తెలిపోవడమే ధ్యేయంగా పెట్టుకుంది ప్రవాహం ఎటుతీసుకపోతే అటు వెళ్లడం తప్ప ఎదురీదే శక్తి ఆ బుడగ కెక్కడిది? ఎప్పుడో కప్పుడా బుడగ పేలిపోతుంది సరి! మరి ఆ నీటిబుడగ గురించెవరూ ఆలోచించరు. జీవితం ఎవరిదైనా అంతే! ఒక నీటిబుడగ మరొక నీటి బుడక్కి ఏం సాయపడగలుగుతోంది, తోడుగా ప్రయాణం చెయ్యడం తప్ప?

తన మనస్సులో ఇంత నిర్లిప్తతా, ఇంత వైరాశ్యం ఎలాచోటు చేసుకుంది ఇంత అకస్మాత్తుగా? తలచుకుంటే భయం వేస్తుంది! ఈ సంసార వ్యామోహాన్ని వదిలి సన్యసించాలనిపిస్తుంది కాని మనసెక్కడికి పోతుంది? శరీరం ఎక్కడికి పోతుంది? ఆ రెండూ ఉన్నప్పుడు ఆలోచనలు పుంఖాను పుంఖాలుగా పుట్టి మనసుని నల్లటి మేఘంలా కప్పక మానవు కదా?

* * *

తెల్లవారజామున నాలుక్కి లేవడం — స్నానం చేసి వంట చెయ్యడం (తన కోసం మాత్రం ఇప్పుడు!) క్లాసు పిల్లం కాంపోజిషన్ పుస్తకాలు దిద్దడం పక్కవాటాలో అద్దెకు దిగిన శ్రీధరమూర్తిగారి ఆరు, ఎనిమిదీ ఏళ్ల లమ్మాయిలు అర్థంకాని లెక్కలు చెప్పమని వస్తే వారికి బోధ పరచడం, పదికల్లా అన్నం తిని స్కూలుకి పోవడంతో ఉదయం గడుస్తుంది స్కూలుకిపోతే పిల్లల సందడి, వారి ఆనందం మధ్య తన విచారం మరిచి పోగలుగుతోంది అక్కడే తన నిజమైన జీవితం ఉందనిపిస్తుంది

సాయంత్రం ఇంటికి రాగానే మళ్లా బోసిగా ఇల్లు! తనని నవ్వుతూ ఆహ్వానించే అమ్మ కాని, నాన్న కాని, బంధువులు కాని లేని ఎడారివంటి ప్రదేశంగా మారింది ఒకనాడు బంధువులతో, ఆప్యాయతతో కళకళలాడే ఈ ఇల్లు —

శ్రీధరమూర్తి బ్యాంక్‌లో అసిస్టెంటు — ముప్ఫయి అయిదేళ్ల వయస్సు — బలంగా పొడుగ్గా ఉండి ఎప్పుడూ చిరునవ్వు ముఖంతో పలకరిస్తాడు అతని భార్య వల్లి అతనికి సరిగ్గా సరిపోయిన జోడీలా అతడికి తగ్గ ఎత్తు ఆరోగ్యం కలది — కోనసీమలో పుట్టి పెరిగింది — చదువు

# స్పందన

మెట్రిక్‌తో ఆగిపోయినా తెలుగు, ఇంగ్లీషు పత్రికలు భర్త తను రీడింగ్ రూమ్‌నించి తెచ్చినవన్నీ చదువుతుంది — చంపాకిస్తుంది. కలుపుగోలుగా ఉంటుంది — తమ ఇంట ఎందుకున్న కూరలూ, పిండివంటలూ స్వయంగా తెచ్చి చంపాకిస్తుంది ఆ ఇద్దరూ తనని ఒక తోబుట్టువులా చూసుకొని, ఆప్యాయత కురిపించబట్టికాని, లేకపోతే ఆ ఇంట ఒంటరిగా ఉండడం దుర్భరమే అయ్యేది చంపాకి

ఏదన్నా మంచి సినిమావస్తే ఆమెతో కూడా చంపాని రమ్మని పట్టుపట్టి తీసుక వెళ్లేవారు పండుగ వస్తే తమ ఇంట భోజనం చేసి తీరాలనేవారు. నెల అయ్యేటప్పటికి ఇంటద్దె ఇవ్వడమే కాక, పిల్లలకి చదువు చెప్తున్నందుకు మరో ముప్ఫయి ఇవ్వబోగా చంపా చాలా బాధ పడింది — "మీరు నన్ను ఇలా అవమానించకండి అన్నయ్యగారూ! ఆ పిల్లలు ఉండబట్టే నాకూ ఊసుపోతోంది.. మీరు నా మీద చూపే ఆప్యాయతకి వెల కట్టమంటారా?" అని అడిగింది

కాని ఏడాదికన్న వారుండలేదు. శ్రీధరమూర్తికి ప్రమోషన్ వచ్చి రాజమండ్రీ వెళ్లిపోవడంతో చంపా జీవితంలో ఉన్న ఆ కాస్త ప్రశాంతతా పోయి నట్టయింది కన్నీరు పెట్టుకుంది వారు వెళ్లిపోయే రోజున—పిల్లలు ఒకటే ఏడుపు - ఆంటీని కూడా తమతో రమ్మని! "మనుష్యులం కలుస్తాం! ఆప్యాయత పెంచుకుంటాం. విడిపోతాం! పాత జ్ఞాపకాల మిగిలిన బాధనే మిగులుస్తుంది! మమకారాలు పెంచుకోడం ఎంత మూర్ఖత్వం!" అనిపించింది చంపాకి!

కొత్తగా దిగినవారు అందువల్లే దూరంగా ఉండేలా చూసుకుంది చంపా శ్రీధరమూర్తి తన బ్యాంక్‌లో తనస్థానే వచ్చిన లక్షణరావుకి ఆ ఇల్లు కుదిర్చిపెట్టేడు ఇంటి అద్దె డెబ్భయికి అతడే పెంచేడు లక్షణరావు కుర్రాడు. భార్య, అత్త ఒక రెండేళ్ల కొడుకు. వాళ్లెప్పుడూ వారి లోకంలో ఉంటారు. కొత్తపెళ్లి పొంగు, ఆ విసురు, ఆ నిషా ఆనందం వారినింకా అంటుకొనే ఉన్నాయి. సాయంత్రం ఇంట ఉండరు — ఎక్కడికో

ఒకచోటికి పోతారాదంపతులు — ప్రతివారం రెండు సినిమాలు పార్కు స్నేహితుల ఇళ్లు. మరింత మంది పిల్లలు, సంసార విస్తరణ, చింతల విస్తరణ జరగక ముందే జీవితం నించి రాబట్ట వల్సిన ఆనందానుభవాన్ని పొందాలని వారు నిర్మించుకున్న లోకంలోకి చంపా ప్రవేశించడం భావ్యం కాదనుకుంది. దూరంగానే ఉండిపోయింది అయితే చంపకి శెలవయి, లక్షణరావుకి శెలవురోజు కానప్పుడు (స్కూలుకి ఎక్కువ శెలవులు) ఎప్పుడూ రేడియోతోనూ, పత్రికల సీరియల్స్‌తో నూ కాలక్షేపం చేసే లత, చంపాతో కబుర్లకని, కొడుకుని ఎత్తుకొని వస్తుంది కొంతసేపు కబుర్లయితాయి చంపా ఒక చిన్న రచయిత్రనీ, ఆమె కొకసారి బహుమతి వచ్చిందనీ తెలుసుకున్న లత, తను చదువుతున్న సీరియల్స్‌లోని బాగోగులనీ ఎలా ఎండింగ్ అవడానికి అవకాశం ఉందో చర్చిస్తుంది అప్పుడప్పుడూ కథలే తప్ప, సీరియల్స్ చదవని చంప, శ్రద్ధగావిని తన అభిప్రాయం చెప్తుంది

"చంపా! ఈ సీరియల్స్‌లో వంటి నాయకా నాయికలు, సన్నివేశాలూ వాస్తవిక జీవితంలో ఎందుకుండవు? సీరియస్ నవలలోని విచారకరమైన సన్నివేశం కూడా హృద్యంగానే ఉంటుంది!" లత అడిగిన ప్రశ్నకి చంపా ఏమనగలదు?

"అందుకే అది కథా జగత్తయింది అది కాల్పనిక లోకం జీవితంలోంచి పాత్రలనీ, సన్నివేశాలనీ రచయిత తీసుకోవచ్చు కాని నవలలో జరిగేది జీవితం కాదు కల్పన! అందులోని దుఃఖంలో మెలోడ్రమా ఉంటుంది మరి కొన్నిపాత్రల సానుభూతి కనిపిస్తుంది రెండు మూడు పేజీల తరవాత కథే మారిపోతుంది వాన తరవాత ఎండలా గబగబా వెలుగునీడలు మన కళ్లకు కడతాయి అది అచ్చులో అక్షరాల సినిమా .. మన మెదడు ఎవరికి తోచిన దృశ్యం వారికి ఏర్పరుస్తుంది సినిమాలో అయితే అందరూ చూసే దృశ్యం ఒకటే—నవలలో, కథలో రచయిత వర్ణించేదీ, చెప్పేది చదివేవారి అనుభవంబట్టి, ఇష్టాయిష్టాలబట్టి, మనసులో వేరే వేరే రూపాలు ధరిస్తుంది కలలకి ఆస్కారం ఇస్తుంది కాని జీవితంలో కష్టాలుకాని సుఖాలు కాని నవలలోలా తెరలుగా ఉండవు కష్టంలో అంతర్లీనమయి సుఖం, సుఖంలో అంతర్లీనమయి కష్టం ఉంటాయి అంతేకాక ఒక హటాత్ సంఘటన యొక్క ప్రభావం నవలలోలా రెండు పేజీల తరవాత మారిపోదు కష్టం యొక్క అతి ఉధృతమైన స్థితి తరవాత ఆ కష్టం ఎదుస్తూ ఉండగానే రిలీఫ్ కూడా ఉంటుంది అలానే ఎంతో ఆనందకరమైన సన్నివేశం జీవితంలో జరిగాక, ఆ కెరటం విరిగాక అయ్యో ఆ ఆనందం పోయిందే అన్న విచారమూ ఉంటుంది!"

"అయితే నవలలూ జీవితమూ దగ్గరవి కావంటారు!"

"కావు! అది కల్పన 'ఇది నిజం' ఈ నిజం మరిచిపోడానికి ఆ కల్పనలోకి మనం జారుకొని, ఆ పాత్రల కష్టసుఖాలు మనం అనుభవించేసి నవల పూర్తవగానే ఒక అనుభూతి పొందుతాం — నవల ఉత్తమమైనదైతే మనల్ని ప్రభావితుల్ని చే

**జరిగిన కథ-16** చంప నాన్న కాశీపతి చాలీచాలని జీతంతో ఆ ఇంటిని అలానే నెట్టుకొస్తుంటాడు చంప నాన్నమ్మకి ఓపిక ఉన్నంత కాలమూ చాకిరీ చేయించుకొన్న కొడుకులూ, కూతుళ్ళూ ఆమెకు ఓపిక తగ్గడంతో ఆమెన్ను పోషించటానికి వెనుకాడతారు ... తంలో తన కంపాస్ బాక్స్ దొంగిలించిన అప్పారావ్‌ని తన పుట్టినరోజు అని చెప్పి తన ఇంటికి నాన్న చెప్పగా ఆహ్వానిస్తుంది చంప. అనుకోకుండా అనేకమైన ఖర్చులు నెత్తిన పడడంతో ఇల్లు అమ్మగా వచ్చిన తన వాటా మొత్తం ఖర్చయిపోతుంది ఈలోగా చంపా పెద్దమనిషయి కూర్చుంటుంది రామంని వైజాగ్ ఇంజనీరింగ్ కాలేజీలో చేర్పిస్తాడు నాన్న చంపా కాలేజీలో చేరుతుంది తాము చేసుకున్న పెళ్లి ఒప్పందం ప్రకారం లాయర్ ప్రకాశరావు శ్రీనుని మెడికల్ కాలేజీలో చేరేట్టు చేస్తాడు రామం, లిల్లీ ప్రేమించుకొంటారు రామం, లిల్లీల పెండ్లి అయిన తరువాత వాళ్లు హనీమూన్ యాత్రకి వెళ్లి తిరిగి వస్తారు. తను చదువుకున్న స్కూల్లోనే ఉపాధ్యాయినిగా చేరుతుంది చంప శ్రీను, మీనాక్షిల పెండ్లి ఆడంబరంగా జరిగిపోతుంది లిల్లీ రామం దగ్గరికి చేరుకొంటుంది రామం లిల్లీని పెళ్ళి చేసుకున్నాడన్న నిజం తెలిసిన అమ్మ నిద్ర మాత్రల ప్రభావంతో ప్రాణం పోగొట్టుకోగా, చంపా కుమిలిపోతుంది అమ్మ పోయిన బాధ నుండి పూర్తిగా కోలుకోని చంపా నాన్న కూడా పోవడంతో ఆమె దిక్కులేనిదౌతుంది అమెరికాలో ఓ స్నేహితుని కోరికపై అతని ఇంటికి పార్టీకి కారులో వెళ్లి తిరిగివస్తున్న రామం యాక్సిడెంట్‌లో మరణిస్తాడు

# బ్రూక్ బాండ్
# గ్రీన్ లేబిల్

## మంచి రుచికి ఎల్లప్పుడూ
## నమ్మవచ్చును

గ్రీన్ లేబిల్ యొక్క రుచి మీరు దీనిని కొన్ని సంవత్సరంలుగా ఇష్టపడేలా చేసింది. సువాసన మరియు సంతృప్తి నిస్తుంది.




## మీ కుటుంబ సాంప్రదాయకంగా
## వచ్చిన రుచి

OBM-6306A1 TEL R

మనసుకు నచ్చిన పిల్లే మరి పెళ్ళికూతురు
ప్రేయసి మెచ్చిన చీరే మరి చీర





# Balkrishna




ప్రకృతి ప్రసాదించిన మహత్తర కానుక-ప్రత్తి.
అందులోనుంచి దారాన్ని తీసింది మానవుడు.
సాధించిన ఘనత అపూర్వం.
ఆ రెండింటి అందమైన కలయికకు ఫలం
బాలక్రిష్ణావారి 'మేనక' చీర.
వెల్వెట్‌లా మెత్తగా –
చెప్పనలవికాని డిజైన్లలో

★ 100% పాలియెస్టర్—
  • లా-ఇంటిమేట్ • మోనాలి • ఈప్స్ బ్యాటి
★ టెర్రిఫిల్ షిఫాన్
★ వైకాట్-2
★ సిలోక్సా
★ టెర్రీసిల్క్
★ టెక్సాఫిల్
★ సిల్కీనా

మేనక
ప్రకృతితోనూ, వస్త్ర సాంకేతిక శాస్త్రంతోనూ ఒకటై, ఏకమై.

బాలక్రిష్ణా టెక్స్‌టైల్స్ ప్రైవేట్ లిమిటెడ్
నరోల్ (అహ్మదాబాద్)



జనవరి 26 న మద్రాసులో తిరుమల స్వామి వివాహమహోత్సవం పురప్రముఖుల సంఘం ఆధ్వర్యంలో జరిగింది స్వామివారికి సంగీత సేవలు చేస్తున్న బాలమురళి, సుశీల, జానకి, సుబ్బలక్ష్మిగార్లను పై చిత్రంలో చూడవచ్చును

లందులోని సత్యాలని మన జీవితానికి అన్వయించుకొనేలా చేస్తుంది – వారి పొరపాట్లు మనమూ చెయ్యకుండా సాయపడవచ్చు ''

ఇలా నడిచేవి చర్చలు

కాని లతక్కి చంపా గురించి అంతా నచ్చింది కాని, అప్పారావు ఇక్కడికి ప్రతి దినం ఇంచుమించు సాయంత్రం ఎప్పుడో ఓ సమయంలో వచ్చి చంపాతో కష్టసుఖాలు మాట్లాడి వెళ్లడం మాత్రం నచ్చలేదు – కాని ఎలా చెప్పడం ? ఆ సంగతి శ్రీధరమూర్తి సూచించనే సూచించేడు–అప్పారావు వారి కుటుంబ స్నేహితుడనీ, అతడు వచ్చిపోవడం కేవలం స్నేహితమేననీ చెప్పినా, లతకి నచ్చలేదు – తనూ భర్తా తిరగడానికి పోయే సమయంలో చంపా ఇంటికి వచ్చే అప్పారావుకీ చంపకీ మధ్య స్నేహమేనా ఉండేది ? ఆ తక్కువ కులం కుర్రాడితో ఈ ఎక్కువ కులం పిల్లకంత ఇదేమిటి ? ఆ సంగతి భర్తతో అంటే అతడు పట్టించుకోకుండా ''పోనీ . మనకెందుకు ?'' అంటాడు

ఒకసారి ఒక సీరియల్ నవలలో ఇటువంటి సన్నివేశమే ఉన్నట్టు సృష్టించి లత ఆ కథ చంపాకి చెపుతూ అంది ''ఆ ఒంటరిగా ఉన్న పెళ్లికాని అమ్మాయి ఇంటికి రోజూ అలా సాయంత్రం ఆ అబ్బాయి రావడం ఊళ్లో ఎన్నో అపనాదులకి దారితీసింది వారి కులమూ ఒకటి కాదు ! దాంతో ఆమెకే పెళ్లి సంబంధాలూ రాలేదు ''

లత చెపుతున్నది సీరియల్‌లోది కాదని చంపా గ్రహించి చిరునవ్వు నవ్వింది ''తరవాతేమయిందిట ?''

''తరవాతది సశేషం ! కాని నాకనిపిస్తుంది ఆమె ఆ అబ్బాయిని రానివ్వకూడదని – పెళ్లాడే ఉద్దేశం ఉంటే పెళ్లి చేసేసుకోవాలి !'' లత సూచించింది –

''స్నేహం స్నేహమే–లోకం ఏమనుకుంటేనేం ? స్త్రీ పురుషుల మధ్య, మగాళ్ల మధ్య ఉండే స్నేహంలా ఉండదంటావా లతా ? దానికి పెళ్లే ఎందుకు పరమావధి అవాలి ?''

''మరి ఆమె అలా పెళ్లికాకుండా ఎన్నాళ్లుంటుంది ? అతడివల్ల ఆమె జీవితంలో ఎన్నో అడ్డు ఏర్పడ్డవిలేదా ?''

## స్పందన

''అది ఆమె సమస్య! ఆమె కతడు స్నేహితుడిగా రావడం ఇష్టమయినప్పుడు ఎవరికిష్టమయినా మానినా ఆమె ఎందుకు చింతించాలి ? ఎవరి జీవితం వారిది మరొకరికి కష్టం కలిగించకుండా తన మనాన తాను స్వతంత్రంగా బతికే హక్కు ప్రతి వ్యక్తికీ ఉంది కదా లతా ?''

లత జవాబు చెప్పలేదు కాని చంపా ధోరణి నచ్చలేదు

### 39

''చంపా ! నా చెల్లి పెళ్లి నిశ్చయమయింది !''

అంటూ ఎంతో ఆనందంగా అప్పారావు ఒక సాయంత్రం చెప్పినప్పుడు అతడు సంతోషించినంత తనూ సంతోషించింది చంపా

కాఫీ చేసి పట్టుకొచ్చి ఇస్తూ ''ఏమిటి వివరాలు ?'' అంది చెల్లెలు రాణికోసం ఎన్నో సంబంధాలు వెతికేశు అప్పారావు చదువుంటే ఉద్యోగం లేదు – ఉద్యోగం ఉంటే చదువులేదు రెండూ ఉంటే పెద్ద సంసారం అన్నీ కుదిరిన చోట కుర్రాడి బుద్ధి బాగులేదు ఇలా తన ఒకే చెల్లెలి కోసం సంబంధాలు గాలించే అప్పారావుని చూసి జాలిపడేది

''కుర్రాదు సాలూరులోని ఒక లారీ ఓనరు ముగ్గురు కొడుకుల్లోనూ రెండోవాడు – కాలేజీలో చేరి మానేసి నాన్న వ్యాపారం చూస్తున్నాడు – బాగుంటాడు నల్లగా ఉన్నా – రౌడీవేషాలు లేవు అంతా పాలిష్డ్ వ్యవహారం – మంచి వాకచక్యం ఉంది '' ఫోటో అందించేడు అప్పారావు

''కట్నం ఏపాటి ?'' అప్పారావిచ్చిన ఫోటో చూస్తూ అడిగింది పెద్ద ఉంగరాల జుత్తు సైడ్ క్రాఫు – సూదిగా చెక్కిన మీసకట్టు బాగున్నాడు

''ఏం చేస్తాం చంపా ? ఉన్నది ఒక్క ఆడపిల్ల ! ఘనంగా పెళ్లి చెయ్యాలి కట్నం కింద ఒక బస్‌రూటు ఒక బస్సూ ఇచ్చేస్తున్నాను !''

''అంటే బస్సు ఖరీదేకాక, రోజూ వచ్చే ఆదాయం కూడా ధారాదత్తం చేస్తున్నావన్నమాట!'' ఆశ్చర్యపోయింది చంపా

''డబ్బెందుకు చంపా ఉండి ? సుఖపడ్డానికేగా ? ఈ డబ్బుతో వాళ్లు సుఖపడితే నాకానందమేగా ? ఓ బస్సురూటుపోతే నాకొచ్చిన నష్టం ఏమిటి ? నాకేం పెళ్లామా పిల్లలా ? నేనెలాను మొఖ్ఖీసుగాడ్ని ! తమ్ముడు పెద్దోడయ్యేక వాడి పెళ్లి . నా పింతల్లి కొడుకుల పెళ్లిళ్లూ జరిపించేస్తే మరింక నా బాధ్యత తీరిపోతుంది !''

చంపా పకపకా నవ్వింది . ''ముసలాడిల్లా కబుర్లు చెప్తున్నావ్ ! నిన్ను ఎవరు ఆపేరు పెళ్లి చేసుకోకుండా ? నచ్చిన పిల్లని పెళ్లాడి సంసారం చెయ్యి . ! పిల్లల్ని ఈ ప్రపంచంలోకి తెచ్చి పెద్ద చేసి ఏ వ్యాపారం ఒప్పగించు ?''

(34 వ పేజీ చూడండి)

## హెచ్చరిక

రవ్వలా జనిస్తుంది
జ్వాలలా జ్వలిస్తుంది

గువ్వలా పిలుస్తుంది
గుండెలో పొడుస్తుంది

దివ్వెలా దీపిస్తుంది
దిగంతాలకు తోసేస్తుంది

విద్యార్థులూ తస్మాత్ జాగ్రత్త !

రాజు కుంటున్న .
రాజకీయపు మంటల్లో
రాజబాటలున్నాయనుకుంటూ

మాడిపోకండి – మండిపోకండి
సమిధలై శలభాలై !

— మరువాడ భానుమూర్తి

(గత సంచిక తరువాయి)




అగ్ర భాగంబున మధ్య సింహకేతనంబు ధరించిన రథముపై భీమసేనుడుగ్రమూర్తి వలె నిల్చాడు... వాని కనుసైగలలో మెలిగేలాగున ఈవలప్రక్క కర్ణికార ధ్వజుండైన అభిమన్యుడు, వానిప్రక్క ఉపపాండవులు. భీముని కావలప్రక్కన శరభధ్వజుండైన నకులుడు, హంసధ్వజుండైన సహదేవుడును ద్రుపద విరాటులు పాంచాలమత్స్యసైన్యములతో సాత్యకి సమేతంబుగ దక్షిణోత్తర భాగంబుల నిల్చిరి.




మధ్య, ధవళచ్ఛత్ర చామరంబులు మెరయుచుండగ చంద్రుడు నక్షత్రములు గ్రహములు జెండాగుర్తుగాగల రథంబుపై గజబలంబుల వెనుక నిడుకొని ధర్మరాజు నిలిచెను...




ముందు భాగంబున శ్రీకృష్ణుడు సారథిగ కపిధ్వజంబు గల అమోఘ రథంబుపై అర్జునుడు తన గాండీవము ధరించి నిల్చెను. వాని రక్షణాలో శిఖండి ప్రక్క రథము నందుండెను. కొంచెము వెనుకగ మాగధ సహదేవ ధృష్టకేతుల రథంబులు నిల్చినవి......




గజబలంబుల రక్షించు రథికుల ననుసరించువిధంగా నిల్పిరి...

[ఇంకా ఉంది]

# సినిమా

—జి.వి.జి.

### సప్తపది కోసం ఫలించిన అన్వేషణ

"దాదాపు ఆరు మాసాలుగా ఎదురు చూస్తున్న ముహూర్తం వచ్చింది. మా కలలు ఫలించాయి. విఖ్యాత దర్శకులు కె. విశ్వనాథ్‌గారి దర్శకత్వంలో మేము నిర్మించే 'సప్తపది' చిత్రంలో కొన్ని ప్రత్యేకమైన అర్హతలున్న నాయికా నాయకుల కోసం ఆరు నెలలుగా కంచు కాగడా పట్టి గాలించాం. ఎంతోమందిని ఇంటర్వ్యూ చేశాం. ఎంతో వ్యయ ప్రయాసలకోర్చి మేకప్ టెస్ట్‌లు, మూడ్ టెస్ట్‌లు కూడా చేశాం. ఇంతకాలానికి మా శ్రమ ఫలించింది. విశ్వనాథ్‌గారి డైరెక్షన్‌లో తొలిసారిగా నటించే అవకాశం సబిత, రవికాంత్, గిరీష్‌లకు దక్కింది. వీరితోపాటు జె. వి. సోమయాజులు, రమణమూర్తి, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు, ఝాన్సి, జానకి, ఫణి ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. ఫిబ్రవరి 9 నుండి అమరావతిలో షూటింగ్ ప్రారంభమై, ఒకే షెడ్యూల్‌లో పూర్తవుతుంది," అన్నారు నిర్మాత భీమవరపు బుచ్చిరెడ్డి. ఆంధ్రదేశపు ప్రాచీన ఔన్నత్యాన్ని, సంస్కృతిని మరోసారి ప్రేక్షకులకు అందించే ఈ సంగీత నృత్యమయ చిత్రానికి జంధ్యాల, మహదేవన్, వేటూరి, కస్తూరి, తోట, జి. జి. కృష్ణారావు, నండూరి విజయ్, బి. అంజిరెడ్డి తెరవెనుక కృషి చేస్తారు.

### ఘరానా గంగులు

"మా పిక్చర్‌కు 'ఘరానా గంగులు' అని పేరెట్టాం," అన్నారు రూపశిల్పి ఎ. పోతరాజు. ఈయన కట్టా సుబ్బారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో నిర్మించే సరిగమ ప్రొడక్షన్స్ చిత్రంలో శోభన్‌బాబు, శ్రీదేవి, శరత్‌బాబు, కవిత, చలం, నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, కొత్త నటి స్మిత పాల్గొంటున్నారు. "ఫిబ్రవరి 1 నుండి 15 వరకు మైసూర్‌లో షూటింగ్ ఉంటుంది. రెండు పాటలు పిక్చరైజ్ చేస్తాం. మార్చి 1 నుండి 10 వరకు జరిగే నాలుగో షెడ్యూల్‌తో షూటింగ్ పినిష్ అవుతుంది," అన్నారు కట్టా సుబ్బారావు.



పై : 'ఘరానా గంగులు'లో స్మిత

### విదేశాలకు శంకరాభరణం, హరిశ్చంద్రుడు

"ఎనిమిదవ అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో సౌత్ ఇండియన్ ఫిలిమ్ ఛేంబర్ ఆఫ్ కామర్స్ అనుబంధ సంస్థ 'సౌత్ ఇండియన్ ఫిలిమ్ ఎక్స్‌పోర్ట్ ప్రమోషన్ కౌన్సిల్ ప్రైవేట్ లిమిటెడ్' తరపున చిత్రాలను విక్రయించాలనే ఉద్దేశంతో నాలుగు భాషల చిత్ర నిర్మాతలం ఏకమై, ఒక కమిటీని ఏర్పాటు చేసుకున్నాం. ఇందులో ఏడుగురు బోర్డాఫ్ డైరెక్టర్స్ ఉన్నాం. నేను మేనేజింగ్ డైరెక్టర్‌ని," అని యు. విశ్వేశ్వరరావు వివరిస్తూ, "ఈ సంస్థ తరపున మేం 9 తెలుగు, 3 తమిళం, 5 మలయాళం, 13 కన్నడ చిత్రాలను తీసుకెళ్ళాం. వీటిలో 'శంకరాభరణం'ను మారిషస్, యు. కె. ఖరీదు చేశాయి. నేను రూపొందించిన 'హరిశ్చంద్రుడు' చిత్రాన్ని మారిషస్ ఖరీదు చేసింది. మొత్తం పదిహేడున్నర లక్షల మేరకు విదేశీ ద్రవ్యాన్ని ఇలా మా మండలి ఆర్జించింది. ఇందులో తెలుగు చిత్రాలమీదే అయిదు లక్షల వరకు వ్యాపారం జరిగింది. మార్చి 14 నుండి 21 వరకు మారిషస్‌లో మా మండలి ఒక చలన చిత్రోత్సవం జరపబోతోంది. ప్రదర్శింపబడే మొత్తం 20 చిత్రాలలో 6 తెలుగు చిత్రాలు ఉంటాయి. ఆ తర్వాత పశ్చిమ జర్మనీలో కూడా ఒక చలన చిత్రోత్సవాన్ని జరపాలనుకుంటున్నాం. నేను దర్శకత్వం వహిస్తూ నిర్మించిన 'హరిశ్చంద్రుడు' చిత్రానికి 'ఏ' సర్టిఫికేట్ ఇవ్వబడింది. లోక్‌నాయక్ జయప్రకాష్‌నారాయణ్‌కు అంకితమివ్వబడిన ఈ చిత్రం త్వరలో విడుదలవబోతోంది," అన్నారు.





దాసరి నారాయణరావు
శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించు
అన్నపూర్ణా స్టూడియోస్
ప్రేమాభిషేకం
ఈస్ట్మన్ కలర్
నిర్మాతలు: వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని
అన్నపూర్ణా ఫిలింస్

## సి
## ని
## మా



'అద్దాల మేడ'లో మురళీమోహన్,

### దీపారాధనలో
### జానెడు పొటకోసం సాధన

ప్రసాద్ (శోభన్ బాబు), మురళి (మురళీమోహన్), మోహన్ (మోహన్‌బాబు) పాకలోకి ప్రవేశించారు.

''కమాన్ ! రావయ్యా, రా ! ఎలా ఉంది మన రూమ్ ?'' అన్నాడు ప్రసాద్.

''ఓహో ! చాలా బాగుందండీ, గురువుగారూ! పర్ణశాల ...'' అంటూ మోహన్ కోటు విప్పగా లోపల చిరుగుల చొక్కా ఉంది. అది చూసి, ''ఈ పర్ణశాల ఏంటీ ?'' అని ప్రసాద్ అడిగేసరికి ''లోకం, గురూ ! మనిషి లోపల ఏమున్నా -- దాన్ని కప్పెయ్యడం ఈ రోజు మనిషి బతకాల్సిన పద్ధతి. కొంతమంది బ్లాక్ డబ్బును భూమిలో కప్పేస్తారు. కొంతమంది డబ్బును అధికారంతో కప్పేస్తారు. కొంతమంది పాపాన్ని డబ్బుతో కప్పేస్తారు ... మనం ఈ చిరుగులు – ఈ కోటుతో కప్పేస్తాం. ఇది నిజం. ఇది అబద్ధం,'' అన్నాడు మోహన్.

''అవునూ – నువ్వు ఉద్యోగం కోసం ట్రై చేసే కంటే సినిమాల్లో వేషాల కోసం ట్రై చెయ్యొచ్చు కదా ?''

''చేశాను, గురూ ! మనం కెమెరా ముందు నిలబడితే — వణుకు, దడ ... నోరు విప్పితే కంపు— భాష. మనం పనికిరామని మద్రాసు నుంచి తోసేశారు ... గురూ ! ఇంతకీ, కింద బాగా యాక్ట్ చేశానంటావా ?''

''సూపర్ పెర్‌ఫార్మెన్స్ ! ముసలోడు అదిరిపోయాడు.''

ఇంతలో మురళి ''ముసలోడ్ని అదరగొట్టడం కాదు; వాళ్ళమ్మాయి ఉంది. అక్కడ నీ పప్పులు ఉడకవ్ – జాగర్త !'' అన్నాడు.

''అమ్మాయ్ ... అమ్మాయ్ ... ఆ అమ్మాయ్ అమ్మ, ఆ అమ్మ అమ్మమ్మ — ఏ అమ్మ వచ్చినా సరే — నా ముందు ...'' అంటూన్న మోహన్ ఆగాడు.

లక్ష్మి (జయప్రద) రాకతో మిత్రులు ముగ్గురూ నిర్ఘాంతపోయారు.

''ఆఁ ... ముందు ?'' చెప్పమన్నట్టు ప్రశ్నార్థకంగా చూసిన లక్ష్మి ''నాకిందాకే అనుమానమొచ్చింది. అది తెలుసుకుందామనే పైకొచ్చాను. నువ్వు చాలా అమాయకుడివి; ఏమీ తెలియనోడివి అనుకున్నాను ... తియ్యండి ! సామాన్లు తియ్యండి !'' అంది.

''లక్ష్మి ! అన్నపూర్ణ— శ్రీ అన్నపూర్ణ ... భద్రకాళి — శ్రీ భద్రకాళి ... నువ్ భద్రకాళి కాదు; ఈ ఒక్క పని మాత్రం చెయ్యొద్దు. ప్లీస్!'' ప్రసాద్ దీనంగా చూసి, ''లక్ష్మి, నేను చెబుతున్నాను. మాకు అతి త్వరలో మంచి భవిష్యత్తుంది. అప్పుడీ దేశాన్ని ఏలేస్తాం. నిన్ను మహారాణిని చేసి, సింహాసనం మీద కూర్చోబెడ్తాం. మీ నాన్నని పైన కూర్చోబెడతాం. కాని, అప్పటి వరకూ మీ నాన్నకు ఈ విషయాన్ని చెప్పొద్దు. ఓ — కే ?'' అన్నాడు.

''మా నాన్నేమీ పిచ్చోడు కాదు. రేపో మాపో తెల్సుకుంటాడు. జాగర్తగ ఉండండి,'' అంది లక్ష్మి.

''సరే...మేం ఊరెళ్తున్నాం. ఇల్లు జాగర్త !'' అన్నాడు మురళి.

''ఊరికా ! దేనికీ ?'' లక్ష్మి కంగారుపడింది.

''దీని కోసం,'' అంటూ ప్రసాద్ తన కడుపు చూపించాడు.

లక్ష్మి పెదవులమీద చిరునవ్వు తొణకిసలాడింది. ''ఆఁ ... అందుకే రెండు రోజులకు సరిపడే బియ్యం వండుకొని తినండి,'' అంటూ ఒక బియ్యం మూట తెచ్చిపడేసి వెళ్లిపోయింది.

''భగవతీ! బిక్షాందేహీ మాతా అన్నపూర్ణేశ్వరీ తల్లీ !'' అని అరిచారు ముగ్గురు మిత్రులూ ఆనందోద్రేకంతో.

దాసరి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో తుది మెరుగులు దిద్దుకుంటూన్న భాగ్యలక్ష్మి క్రియేషన్స్ ''దీపారాధన'' చిత్రానికి నన్నపనేని సుధాకర్ నిర్మాత.

'ఓ అమ్మ కథ'లో శారద, నూతన్‌ప్రసాద్







'ప్రియ'లో స్వప్న, చిరంజీవి

బోతున్నారు. "మార్చి 1న షూటింగ్ మొదలెడుతున్నాం," అన్నారాయన. అల్లపర్తి సూర్యనారాయణ, మన్నవ వెంకటరావు నిర్మించే, ఈ చిత్రంలో చిరంజీవి, మధాకర్, మాధవి, కవిత, మూన్ని, గిరిబాబు, వంకాయల, మాడా, గెస్ట్‌లుగా నారాయణరావు, సత్యేంద్రకుమార్ పాల్గొంటారు. డి. వి. నరసరాజు సంభాషణలకర్త, ఎం. ఎస్. విశ్వనాధం సంగీత దర్శకుడు. ఎస్. ఎస్. లాల్ ఛాయ, కె. ఎల్. ధర్ శిల్పం, ఎన్. వెంకటేశ్ రెడ్డి సహదర్శకత్వం, రవికుమార్ ప్రొడక్షన్ నిర్వహిస్తారు.

## భారతీరాజా దర్శకత్వంలో ఏడిద నాగేశ్వరరావు చిత్రం

"మార్చి మొదటివారం నుండి దోసకాయలపల్లి, విశాఖపట్నం, చంద్రగిరి ప్రాంతాల్లో నెల రోజుల పాటు షూటింగ్‌తో పూర్తవుతుంది," అన్నారు పూర్ణోదయ మూవీక్రియేషన్స్ అధినేత ఏడిద నాగేశ్వరరావు. ఈయన, భారతీరాజా స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో నిర్మించే చిత్రానికి జనవరి 19న తొలి గీతం ధ్వని ముద్రిక చేయబడింది. నూతన్‌ప్రసాద్, శరత్‌బాబు, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావుతోపాటు నాయికా నాయకులుగా కొత్తవారిని పరిచయం చేస్తారు. జంధ్యాల, ఇళయరాజా, వేటూరి, కణ్ణన్ ప్రభృతులు తెరవెనుక కృషి చేస్తారు. మే విడుదల.

## నా ఇల్లు – నా దేశం

"యడవల్లి, చెన్నాప్రగడ సత్యనారాయణ అనే ఇద్దరు కొత్త రచయితలచేత సంభాషణలు, రావులపర్తి భద్రిరాజు అనే కవి చేత రెండు పాటలు రాయించాం," అన్నారు ముంజులూరి భీమేశ్వరరావు. ఈయన దర్శకత్వం నెలిపే కృత్తిక ఫిలిమ్స్‌వారి పై చిత్రంలో సత్యనారాయణ, జగ్గయ్య, జయంతి, జ్యోతి, రావి కొండలరావు ఇంతవరకు ఎన్నికయ్యారు. "మన దేశమంతా ఒకే కుటుంబం. అందరూ పరస్పరావగాహన, క్రమశిక్షణ, ఐక్యతలో నడుచుకుంటే దేశం ముందంజ వేస్తుంది. దేశంలోని రాజకీయ పంక్షోభాన్ని ఆధారం చేసుకొని, ఈ కథ అల్లాను. జూన్ 20 నుంచి జూలై 15 వరకు విశాఖపట్నం ప్రాంతాల్లో ఒకే షెడ్యూల్‌లో పూర్తవుతుంది. మొత్తం అయిదు పాటలుంటాయి. ఉపేంద్రకుమార్ సంగీత దర్శకుడు," అని వివరించారు భీమేశ్వరరావు.

## ఎం. బాలయ్య దర్శకత్వంలో తొలి చిత్రం

ప్రముఖ నటుడు, కథకుడు ఎం. బాలయ్య, బి. ఇ., తొలిసారిగా అమృతా ఫిలిమ్స్ 7వ చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలను కూడా వహించ



'తిరుగులేని మనిషి'లో ఎన్.టి.ఆర్., జగ్గయ్య

## చిత్ర విచిత్రాలు

★ ''మేరియా మై డార్లింగ్'' అనే చిత్రం తమిళ, కన్నడ భాషల్లో తయారైంది. రెండిటిలోనూ కమలహాసన్, శ్రీప్రియ నాయకా నాయికలు. తతిమ్మా పాత్రధారుల విషయం కూడా అంతే. షాట్ బై షాట్ — రెండు వెర్షన్‌లనూ మక్కికి మక్కీగా తీశాడు డైరెక్టర్ దొరై. ఐతే, తమిళ చిత్రానికి 'ఏ' సర్టిఫికేట్, కన్నడ చిత్రానికి 'యు' సర్టిఫికేట్ ఇవ్వబడ్డాయి.

★ 'మేషా' అనే మలయాళ చిత్రం కేరళలో విడుదలైంది. ఈ చిత్రంలో హీరో మూడు అడుగుల మరుగుజ్జు. ఇలా ఓ మరుగుజ్జు కథానాయకుడుగా తయారైన తొలి చిత్రమిదే.

★ ఇద్దరు హీరోయిన్‌లు తప్ప — మిగతా వాళ్ళందరి సరసన సంజీవ్‌కుమార్ హీరోగా నటించాడు. వాళ్ళిద్దరూ బబిత, నీతుసింగ్. తమాషా ఏమిటంటే వీళ్ళిద్దరూ రాజ్‌కపూర్ కోడళ్ళు!

★ బొంబాయి బాంద్రా హైవే 'ఆపేరా హౌస్' లాంటి చోట్ల బోర్డులు, హోర్డింగ్‌లు పెట్టడానికి ఇదివరకు నెలసరి అద్దె రూ. 1,500. ఆ తర్వాత 4 వేలు, 8 వేలు — ఇలా పెరిగి, ఇప్పుడు 15 వేల రూపాయలైంది!

★ ''కూలీ'' అనే హిందీ చిత్రం తీసే మన్‌మోహన్ దేశాయ్ తన చిత్రంలోలాగా ఒక కూలివాడి ఇతివృత్తంతో మరెవరైనా చిత్రం తీస్తారేమోనని ''కూలీ, రైల్వే కూలీ, బాంబేకా కూలీ, కూలీ మేరా నామ్, కహతే హై ముఝ్కో కూలీ'' అనే టైటిల్స్‌ను రిజిస్టర్ చేయించాడు.

★ బల్జిత్ భట్టి అనే పాతికేళ్ళ చురుకైన యువకుడు కొన్నేళ్ళ క్రితం బల్జిత్ అనే యువతి! 1974 లో లండన్‌కు యువతిగా వెళ్ళి, శస్త్ర చికిత్స మూలంగా పరివర్తనం చెంది యువకుడుగా తిరిగొచ్చాడు. లండన్‌లో ఉన్నప్పుడు 'లండన్ స్కూల్ ఆఫ్ ఆక్టింగ్'లో డిప్లమా పొందాడు. మన దేశానికి రాగానే రాజ్‌ఖోస్లా, సంజీవ్‌కుమార్, రేఖ, సులక్షణ పండిట్, మౌసుమీ ఛటర్జీ, ప్రేమ్‌జీలను కలుసుకొని, తనకు సినిమాలలో చాన్సులిప్పించమని ప్రాధేయ పడ్డాడట. ''సునీల్‌దత్ సాబ్‌కు నా ఫోటో పంపించాను. నాకు తప్పకుండా వేషమిస్తానని ఆయన జవాబు రాశారు,'' అనే ఈ పురుషరూపి— మనిషి మారినా పేరు మారలేదు. అతను సిక్కు. సిక్కులలో కొన్ని పేర్లు పురుషులకు, స్త్రీలకు కూడా ఉంటాయి.

## సినిమా

### అగ్నిపూలులో అసలు రహస్యం!

గుడిలోకి డాక్టర్ (సత్యనారాయణ), జేని (జయసుధ) వచ్చారు. అక్కడి శివలింగాన్ని వింతగా చూస్తూ, "డాక్టర్, ఏమిటిది ?" అంది జేని.

"శివలింగం... దేవుడు... ఈ దేశంలో రాతిలో, చెట్లలో, పుట్టలో, పక్షిలో, పాములో - అన్నిట్లో దేవుణ్ని చూస్తారు."

"మనుష్యుల్లోనే కనబడడు," అంటూ జేని గబగబా బయటకు వెళ్లింది. కొంత దూరంలో ఉన్న ఓ సమాధి దగ్గర ఆగింది.

"అదేనమ్మా మీ నాన్నగారి సమాధి," అన్నాడు డాక్టర్.

జేని ఆ సమాధి మీద పూలు పెట్టింది. ఆప్యాయంగా ఆ సమాధినంతా తడిమి చూసింది. "ఐ లవ్ యూ డాడీ!" అంటున్నప్పుడు ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. "డాక్టర్! మా అమ్మదంటూ ఏ గుర్తూ లేకుండా చేశారు. ఆమెకు సమాధి కట్టలేదేం? నాకు తెలుసు, డాక్టర్! ఎందుకు కట్టలేదో నాకు తెలుసు. బ్రతికుండగా వాళ్ళను విడదీయలేకపోయారు. చచ్చిపోయింతర్వాత విడదీసి ఆనందిస్తున్నారు. అంతేగా? డాక్టర్, నిజం చెప్పండి! మా నాన్నగారు ఎలా చనిపోయారు ?"

"తుపాకి తుడుస్తుండగా... అది హఠాత్తుగా పేలి —"

"నో! అబద్ధం! పచ్చి అబద్ధం! తుపాకి తుడుస్తున్న నాన్నగారిని అదే మంచి సమయమని చాటునుంచి ఎవరో కాల్చి చంపారు. నాన్నగారి తుపాకిలో ఉన్న గుండు వేరే. ఆయన గుండెను

'సంధ్యారాగం'లో శరత్‌బాబు, సుమ్మడి



దూసుకుపోయిన గుండు వేరే. ఈ నిజం మీ కందరికీ తెలుసు. తెలిసీ నోరు మూసుకున్నారు. అందరూ కలిసి హత్యను ఆత్మహత్యగా మార్చేశారు."

డాక్టర్ కంగారుగా చూశాడు. "మై గాడ్! ఇదంతా నీకెవరు చెప్పారు ?"

"అమ్మ డైరీ... నాకీ నగరు, నగరులో ఉన్న మనుషులు, మనుషుల్లో ఉన్న రాక్షసులు – అంతా తెలుసు. అందుకే వాళ్ళంటే నా కసహ్యం... కోపం... కసి... ఐ హేట్ దెమ్. వీలైతే అందర్నీ ఒకేసారి ఒకే చెట్టుకు ఉరి తీయాలనుంది!" అని జేని ఆవేశంతో అరుస్తూంటే, డాక్టర్ దిగ్భ్రాంతుడై చూస్తూండిపోయాడు.

కె. బాపయ్య దర్శకత్వం నెఱపిన సురేష్ ప్రొడక్షన్స్ "అగ్నిపూలు" చిత్ర నిర్మాత డి. రామానాయుడు తమ కార్యాలయం మీద అత్యాధునిక పరికరాలతో నెలకొల్పిన 'సురేష్ మహల్' ప్రివ్యూ థియేటర్‌లో ఈ చిత్రంలోని ఐదు పాటలలో నాలుగింటిని ప్రదర్శించి, "మైసూరులోని లలిత మహల్‌లో 40 రోజులపాటు షూట్ చేశాం. ఆ మహల్‌లోనే 85 వంతులు షూట్ చేశాం. ఆ మహల్ బయట రాత్రి వేళలో చిత్రీకరించిన నృత్యానికిగానూ ఆ మహల్ అంతటా రంగు రంగుల ఎలెక్ట్రిక్ దీపాలు అలంకరించ డానికి యాభై వేలకు పైగా ఖర్చయింది. ఇలా అనుకున్నంతకన్నా బడ్జెట్ పెరిగినా – మరో భారీ చిత్రాన్ని సర్వజనరంజకంగా తయారుచేశామన్న సంతృప్తి మా అందరికీ కలిగింది. ఆఫీస్ బాయ్, కారు డ్రయివర్‌ల వరకు అందరూ ఎంతో ఉత్సాహంగా కృషి చేశారు," అన్నారు. జయప్రద 'సర్ప నృత్యం' ఈ చిత్రంలో హైలైట్.




1941 దాకా తెలుగు సినిమారంగంలో మహోజ్జ్వల తారగా వెలుగొందిన అందాల కథానాయిక కాంచనమాల 58వ ఏట జనవరి 29న మద్రాసులో తమ అంతిమ శ్వాస తీసుకున్నది. పై చిత్రం 'బాలనాగమ్మ'లోనిది.

### జంధ్యాల దర్శకత్వంలో తొలి చిత్రం

ప్రస్తుతం పలిక చిత్రాలకు రచన సాగిస్తూన్న జంధ్యాల రచన, దర్శకత్వంలో "ముద్దమందారం" అనే చిత్రం త్వరలో తెరకెక్కబోతోంది. "విశాఖ పరిసర ప్రాంతాల్లో షూటింగ్ జరుగుతుంది," అన్నారాయన.




'తోడుదొంగలు'లో మధుమాలిని

ఇలా ఆమె తనని కవ్వించడం కొత్తకాదు! కాని గొంతువరకూ వచ్చిన మాట గొంతుదగ్గరే ఆగిపోతుందెప్పుడూ! పెద్ద అడ్డుగోడ ఎదురుగా కనిపించగా ఆ గోడ విరిచే ధైర్యం తనకుండదు! తీరా ఆ గోడ విరిచేక పెద్ద కందకం కనిపిస్తే?

"ముందు చంపి నీ పెళ్లి జరగాలి! అంతవరకూ నే పెళ్లి చేసుకోను!"

"అదేమిటా అంటే?" ఆత్రంగా అడిగింది

"నీ కెవడు నచ్చి పెళ్లాడతావో చూడాలి నేను వాడితో సుఖపడుతున్నావో లేదో తెలుసు

## స్పందన

[26వ పేజీ తరువాయి]

కోవాలి నువ్వు ఆనందంగా ఉన్నావని నిర్ధారణ అయ్యేక కాని నేను పెళ్లి చేసుకోను! ఎందుకంటావేమో? నువ్వు ఒకవేళ సుఖపడలేదనుకో, మరి నేను మాత్రం ఎలా సరదాగా ఉండగలను?"

"నే పెళ్లి చేసుకున్నాక సుఖపడకపోతే, నువ్వు పెళ్లి చేసుకోపోతే నా కష్టం పోతుందా?"

అప్పుడు అప్పారావు చంపాకేసి కొంటెగ చూసి "వాడిని వాళ్ళకు తన్ని నిన్ను తీసుకొస్తాను! వాడు తాగుబోతనుకో నీమీద అనుమానంతో నిన్ను తంతున్నాడనుకో వాడు ముండలమురాకోరనుకో వాడిని ఎత్తుకొచ్చి!"

"అంటే నేను అటువంటివాడ్ని ఎంచుకుంటాననా నీ అనుమానం?"

"మంచోడ్నే ఎంచుకుంటావ్లే కాని పెళ్ళయ్యాక నిన్ను నేను చూడకుండా నీతో మాట్లాడకుండా ఉండను కదా? అప్పుడు వాడి కనుమానం వచ్చి"

"అబ్బ! ఎంతాశ! నా పెళ్లి మరోడితో అయిపోయేక ఇక మాట్లాడినాక వేదవాక్కు! నిన్నిలా చూడను అతడు వద్దంటే? నీవంటి రౌడీతో స్నేహం చేసినందుకు నా శీలం కెంత మచ్చ వేసేరా అతడికి తెలీకుండా ఉంటుందా?"

"ఎవరా మాటన్న స్కౌండ్రల్స్! నిన్నెవరన్నా ఏమన్నా అన్నారా? చెప్పు! వాడి శవం కూడా కనిపించకుండా!"

"అమ్మ బాబోయ్! అదుగో అందుకే నిన్ను రౌడీ అన్నారు! కారులో రోజూ వస్తావు కారు ఎదురుగా గంటో, రెండు గంటలో ఇక్కడుంటావు. బయట ప్రపంచం ఏమనుకుంటుందిట? అప్పారావు కేవలం కాఫీ తాగి వెళ్లిపోతాడని అంటుందా?" అతడి కోసం ఉప్మా చేసి తెచ్చి ఇచ్చి అడుగుతుంది, ముందు అతడు కాఫీ తాగాక – ఉప్మా తరవాత మరో రౌండు కాఫీ ఉంటుంది

"అయితే నువ్వు నన్నెందుకు రానిస్తున్నావు? అప్పారావ్! నువ్వు మరి రాకు అని చెప్పే మరి రాను!" అన్నాడప్పారావు

"అలా చెప్పేస్తే రావడం మానేస్తావా రౌడీ కుర్రాడా? ఆ రోజు కంపాస్ బాక్స్ ఎత్తుకపోయినట్లు ఎత్తుకపోతావు"

అప్పారావు పకపకా నవ్వి "ఎక్కడికి?"

"ఏముంది? నీకెన్ని పాతాళ గృహాలున్నాయో! ఎక్కడో ఎవరి కంటా పడకుండా దాచేస్తావు!"

"నువ్వు బాగా కథలు అల్లగలవ్! నీ హీరో ఎవరో వచ్చి నన్ను చంపి నిన్ను రక్షించడా?"

"నీతో ఏ హీరో చాలగలడు? పైగా నిన్ను చిన్నప్పట్నించీ నా చుట్టూ చూసిన ఏ హీరో నా దరిదాపులకి చేరలేదు! నా దురదృష్టం! ఇంతకీ రాణీ పెళ్లెప్పుడుట?"

"వచ్చే నెల! గబగబా ఏర్పాట్లు చెయ్యాల! నువ్వు వారం రోజులు స్కూలుకి శెలవుపెట్టి ఏంచెయ్యాలమో ఏంటో సలహాలకి నా సైడ్ని నిల్చోవాల ఒప్పుకుంటావా?"

"ఎంత మాట! నువ్వు ఆర్డర్ వెయ్యడమూనా నేను కాదనడమూనా?"

(ఇంకా ఉంది)

త్వరలో

రాగబంధితులు

# ✦ డాక్టర్ సలహాలు ✦

డాక్టర్ కె. వెంకటేశ్వర రావు

జి డి సి — మద్రాస్

నాకు పెండ్లి అయి 6 సం లు అయినది మూడు సం ౹౹ తర్వాత డి అండ్ సి చేయించుకున్నాను అయినా సంతానము కలుగలేదు మావారిలోగూడా ఏమీ లోపము లేదని చెప్పటంవల్ల తెలిసింది నన్ను పరీక్ష చేసి ట్యూబ్ బ్లాక్ అయినదని ఆపరేషన్ చేసారు ఈ ఆపరేషన్ అయి ఆరు నెలలు అయినది ఫలితము కన్పించలేదు మళ్ళీ ట్యూబ్ బ్లాక్ అయ్యే అవకాశము వున్నదా — వుంటే మీ సలహా ఏమిటి ? పై కారణాలవల్ల నాకు పిల్లలు కలిగే అవకాశము వున్నదా ?

★ ఫెలోపియన్ ట్యూబ్‌లో అవరోధం ఏర్పడి, శస్త్రచికిత్సవల్ల ఆ అవరోధం తొలగించబడిన తర్వాత కొంత కాలవ్యవధి, ఆ శస్త్రచికిత్సవల్ల ఫలితం ఉన్నదీ లేనిదీ తీర్మానించటానికి అవసరం ఒక సం పాటు వేచి ఉంచి చూడటం అవసరం అప్పటికీ ఫలితం కనబడకపోతే ఆ శస్త్రచికిత్స సక్రమంగా జరిగిందీ లేనిదీ, కొన్ని పరీక్షలు చేయించుకోవటంవల్ల తెలుస్తుంది ఆ ఫలితాల ననుసరించి కర్తవ్యం ఆలోచించవలసి ఉంటుంది

ఎస్. కె కె — నెల్లూరు

నా వయస్సు 22 సం౹౹లు నేను ఎన్నగా, పొడుగ్గా వుంటాను నాకు చెంపలమీదగాని, గడ్డం మీదగాని వెంట్రుకలు రాలేదు మూతిమీద మాత్రం కొద్దిగా మీసాలు వచ్చాయి టెస్టికల్స్, పెనిస్ తగిన సైజులో లేక చాలా చిన్నవిగా వున్నాయి ఈ లోపానికి, పై లోపానికి ఏదో సంబంధము వుందని నా అనుమానం

★ సెకండరీ సెక్సువల్ కారెక్టరిస్టిక్స్ అయిన వెంట్రుకల పెరుగుదల, గొంతు మార్పిడి, జననేంద్రియాలలో మార్పులు 14వ సం౹౹ నుంచి 20 సం౹౹ల కల్లా పూర్తవుతాయి ఆ తర్వాత కాలంలో ఈ మార్పులు జీవితకాలం అంతా ఉంటాయి ఈ సెకండరీ సెక్స్ ఫీచర్స్ హార్మోనుల పనితనాన్ని అనుసరించి ఏర్పడతాయి వైద్యుల పర్యవేక్షణలో "ఆండ్రోజెన్లు" అనబడే హార్మోనులు వాడి చూడండి

డి ఎస్ — వరంగలు

నా వయస్సు 27 సం౹౹లు నేను ఏదైనా పేపరు చదివేటప్పుడుగాని, ఆకాశములోకి చూసినపుడుగాని సన్నని గీతలు రెండుకండ్లకు కనిపిస్తున్నవి దీనికి ఏమి చెయ్యాలి ?

★ దీనిని "మస్కే వాలిటాన్‌టిస్" అని అంటారు హ్రస్వ దృష్టి (షార్ట్ సైట్) ఉన్న వారికి ఈ లక్షణం కనిపిస్తుంది కొందరికి కొన్ని డీజెనరేటివ్ రోగాల మూలంగా ఏర్పడుతుంది

దృష్టి లోపం ఉన్నదీ లేనిదీ పరీక్షించేసుకోవటం అవసరం ఇలా తీగలు, వివిధ ఆకారాలలో కండ్ల ఎదుట కనబడటంవల్ల పెద్ద ప్రమాదమేమీలేదు ●

# ఈ అనుభవం చాలు

## వేపా శ్యామలాదేవి

"ఐస్ సోడా బాబూ! ఒక్కటి త్రాగితే చాలు మళ్ళీ మళ్ళీ త్రాగాలనిపిస్తుంది ఆలసించిన ఆశాభంగం రండి బాబూ రండి. ఆంధ్రా షోడా అయిపోతోంది" అంటూ చలాకీగా, నవ్వుతూ, అందర్నీ నవ్విస్తూ యించు మించు షోడాబండి అంతా అమ్మేసాడు పది సంవత్సరాల కుర్రాడు. మే నెల ఎండలు తమ ప్రతాపాన్ని చూపిస్తున్నాయి వేడిగాలి చెంపలను తాకుతోంది బస్ కోసం అరగంట నుంచీ నిరీక్షిస్తున్న వందనా, ఆమె తండ్రి పరంధామయ్యగారూ ఒక్కసారి నీరసంగా నిట్టూర్చారు ఈ వెధవ బస్సు అవసరమయినప్పుడు అసలు రాదు నీరసంగా స్థంభాన్నానుకుని నించున్న ముసలి తండ్రిని బాధగా చూసింది వందన

"అక్కా! ఈ సోడా త్రాగు నీ విసుగు ఒక్క క్షణంలో పోతుంది తాతగారూ! మీరుకూడా ఒకటి త్రాగాలి" అంటూ వందన వద్దని వారిస్తున్నా రెండు షోడాలు యిచ్చేడు ఎర్రటి ఎండలో, అంతకన్నా ఎక్కువగా మండుతున్న గుండెల్లోకి చల్లని పానీయం దిగటంతో కొంచెం రిలీఫ్‌గ ఫీలయ్యారు ఆ తండ్రీ, కూతురు

* * *

నెమ్మదిగా ఖాళీసోడాబండి తోసుకుంటూ పాట పాడుతూ వెళ్ళిపోయాడా కుర్రాడు ఆ కుర్రాడుతోనే చైతన్యమంతా ఒక్కసారి ఆగిపోయినట్టుయింది "ఎంత నిశ్చింత జీవితం ఆడుతూ పాడుతూ గడిపే ఆ జీవితం ఎంత మధురమయినది ఎప్పుడూ, నవ్వుతూ తుళ్ళుతూ జీవితం అంటే నందనవనం అనుకునేరోజులు యివి భగవంతుడా! ఈ చిన్నిబాబుకి ఎలాంటి కష్టాన్ని కలిగించవద్దు"

'వందనా' అంటూ వీపుమీద జబ్బ వూడిపోయేలా తగిలిన దెబ్బకి ఉలిక్కిపడి వెనక్కితిరిగింది వందన

"ఓ శశీ! నువ్వా అబ్బా! ఎన్నాళ్ళకి కనిపించావే ఎక్కడ వుంటున్నావు? మీవారేం చేస్తున్నారు? సారీ శశీ! నీ మేరేజికి రాలేకపోయానే మా అమ్మగార్కి అప్పుడు బాగా జబ్బు చేసింది" వందన మాటకు అడ్డుతగులుతూ "అబ్బ ఆగవే వందనా నీ యక్ష ప్రశ్నలన్నింటికీ ఓపిగ్గా జవాబు చెప్తాను కానీ, ముందు నా ప్రశ్నకు జవాబు చెప్పు ఎక్కడ్నించి వస్తున్నావు? మొహం ఏమిటి అలా వాడిపోయింది ఈ ఊర్లో ఎవరు వున్నారు? మీవారికి ఈ ఊరు ట్రాన్స్ఫరయిందా? మీ ఆయన చాలా మంచివాడనీ, అందంగా ఉంటాడనీ ఆరేడు నెలల క్రితం నీ దగ్గరనుంచీ వచ్చిన లెటర్ తప్ప మళ్ళీ లెటర్ రాలేదు మీ ఆయన అందాన్ని చూసుకుంటూ నన్ను మరిచిపోయావు కదూ అరె, బాబాయిగారూ! మీరూ వచ్చారా? అదేమిటి బాబాయ్! మరీ అలా చిక్కిపోయారు అందమయిన అల్లుణ్ణి చూడగానే మా






ఇప్పుడు అద్వితీయమైన ప్యాక్‌లో అదనపు ధర పెట్టకుండానే.

మీకు కావాలి

# కాల్షియం-శాండోజ్®

బిళ్ళలు

## వాడి చూడండి, మీకే కనిపిస్తుంది ఆ తేడా.

మీరు చేయవలసిందల్లా వెనిల్లా వాసనగల, రుచియైన 4 కాల్షియం శాండోజ్ బిళ్ళల్ని ప్రతిరోజూ పదిహేను రోజులపాటు తీసుకోవడమే. మీ గోళ్ళిక దృఢంగా, అందంగా తయారౌతాయి. శాస్త్రీయ అధ్యయనం వలన యీ విషయం ఋజువైంది. తీసుకోండి— కాల్షియం శాండోజ్—స్విట్జర్‌లాండ్‌లో శాండోజ్ వారిచే రూపొందించబడిన, ప్రపంచంలోకల్లా ఉత్తమమైన కాల్షియం. కాల్షియం—శాండోజ్ కావాలని పేరుపెట్టి అడిగి తీసుకోండి, అంతేగాని దానికి బదులు మరి దేనినీ తీసుకు సరిపెట్టుకోకండి.

ఈ సమస్య మళ్ళా తలెత్తుతే, ఆ మోతాదును మళ్ళా తీసుకోండి.




daCunha-S-22 Revi TL



ఈ అనుభవం ఈ అనుభూతి ఈ అనురాగం పెల్లుబికే ఆనందాన్ని వెల్లివిరిసేది

**ఈ క్షణాలిక ఎంత మధురం రోజురోజూ**

బాబాయికి భోజనం కూడా అవసరంలేదన్నమాట ''
గడగడ మాట్లాడేస్తున్న శశినే అందరూ కన్నార్ప కుండా చూడ్డంతో ''వందనా! పదవే ఇక్కడే మా ఇల్లు చాలా కాలానికి కలుసుకున్నాం ఇవాళంతా కబుర్లు చెప్పుకుందాం'' అంటూ బలవంతంగా వాళ్లని తీసుకెళ్ళింది శశి

అందమయిన పెద్ద బంగాళా రకరకాల పువ్వులతో, అందంగా, గుబురుగా వున్న క్రోటన్ మొక్కలతో గార్డెన్ కళకళలాడుతోంది హాల్లో ఖరీదయిన సోఫాసెట్లు, మెత్తగా పరచిన కార్పెట్లు, గోడలకు తగిలించిన ఖరీదయిన ఒకటి, రెండు పెయింటింగ్స్ అడుగడుగునా శశి ఐశ్వర్యాన్ని చాటి చెప్తున్నాయి ఫ్రిజ్‌లోంచి చల్లని నీళ్ళతో కూల్ డ్రింక్ కలిపి ఇచ్చింది ఆపిల్స్ కోసి ప్లేట్లలో సర్దింది ప్రతీ పనీ ఎంతో త్వరగా, నేర్పుగా చేస్తున్న శశిని ముచ్చటగా చూస్తోంది వందన ఎనిమిదిగంటలు అయినా ప్రక్కమీదనుంచిలేవకుండా, పిప్పితో లక్ష్మోత్తరం చదివించుకుని మరీ లేచే శశేనా ఇది ఎంత చక్కగా చేస్తోంది ఎన్ను ప్రతీ పనిలో, ప్రతీ మాటలో ఎంత దర్పం ఆడదానికి ఇంతకన్నా యింకేం కావాలి శశి అదృష్టానికి వందన మనసు ఉప్పొంగిపోయింది

మూడవ వ్యక్తి వున్నారన్న ఆలోచన కూడా మరిచిపోయి స్నేహితురాళ్ళిద్దరూ కబుర్లలోపడ్డారు కాలేజీ సంగతులూ, స్కూలు సంగతులూ ఒకటేమిటి ఎన్నో విషయాలు వాళ్ళ సంభాషణలో చోటు చేసుకుని కాలాన్ని మరిపింపచేశాయి

పెళ్ళయింది మొదలు ఎప్పుడూ దిగులుగా, నిరాశగా వుండే వందన మళ్ళీ పూర్వపు మనిషిలా సంతోషంగా కనపడేసరికి ఆ ముసలి హృదయం ఎంతో ఆనందించింది

ఏమీ తోచక ప్రక్కనే టీపాయ్‌మీద వున్న పేపరు తీసుకున్న పరంధామయ్యగార్కి అక్కడ తను ఇంతవరకూ ఎప్పుడూ చూడని ఖరీదయిన వెడ్డింగ్ కార్డు అందమయిన గోల్డు కలర్ డిజైన్‌లో కనబడింది ఎవరిదో గొప్పవాళ్ళ శుభలేఖ అయి వుంటుంది ఒక్కసారి ఆ కార్డును చేతిలోకి తీసుకుని దాని అందాన్ని మరోకసారి తిలకించారు పరంధామయ్యగారు అప్రయత్నంగా ఆ కార్డుమీద వధూవరుల పేర్లు చూసిన ఆయన హృదయం బాధగా మూలిగింది చెట్టంత అడుగుపెట్టిన కోడల్ని, ఇంతటి శుభకార్యం దగ్గర్లో పెట్టుకుని బయటకు గెంటుతారా? భగవంతుడా! నాకీ వయసులో ఎందుకీ అంపపు కోత — అంటూ ఆయన హృదయం ఆక్రోశించింది

''బాబాయ్! ఏమిటలా చూస్తున్నారు? అవి మా అన్నయ్య పెండ్లి శుభలేఖలు సరిగ్గా ఇవాల్టికి వారం రోజులుంది పెళ్ళి ఈ వారం రోజులూ ఇక్కడే వుండిపోండి బాబాయ్ ఏకంగా పెళ్ళయ్యాకా వెళ్దురుగాని నా మాట కాదనకండి బాబాయ్ వందనా! మీ ఆయన్నుకూడా లెటర్ రాసి పిలిపించవే అందరం కలిసి సరదాగా వుందాం ఇంతకీ ఆ అమ్మాయిది మీ ఊరేనట మీ ఆయనకు తెలిసే వుంటుంది వందనా!'' అంది శశి గలగలా

భర్త టాపిక్ రాగానే తలవంచుకుని తన

# ఈ అనుభవం చాలు

కన్నీళ్ళు శశికి కనబడకూడదని విశ్వప్రయత్నం చేస్తోంది వందన

''ఏవిటే! మీ ఆయన పేరు చెప్తేనే అలా ముడిసిపోతున్నావ్ నా మాటలేమన్నా వింటున్నావా? లేదా?'' అంటూ వందన చుబుకం పైకెత్తింది వందన కళ్ళు శ్రావణ మేఘాల్లా వర్షిస్తున్నాయి ఆశ్చర్యపోయిన శశి ''వందనా! ఎందుకలా బాధ పడుతున్నావు? నాకు చెప్పవా? వచ్చినదగ్గర్నుంచి చూస్తున్నాను అంతవరకూ సరదాగా మాట్లాడే నువ్వు మీ అత్తారి ప్రసక్తి రాగానే ఉదాసీనంగా మారిపోవడం నేను కనిపెడ్తూనే వున్నాను నా దగ్గర కూడ నీకు దాపరికమేనా'' అంది బాధగా శశి

భుజాన వున్న ఉత్తరీయంతో చెమర్చిన కళ్ళను ఒత్తుకుంటూ —

''అదేం చెప్పుదమ్మా! శశీ, నేను చెప్తాను దాని కన్నీటి కథ విసమ్మా నువ్వూ, వందనా నాకు రెండు కళ్ళమ్మా నీకుగాక యింకెవరికి చెప్పుకో గమ్మా హృదయ వ్యధ

విజయవాడలో స్కూలు మాస్టరుగా చేసి రిటైరయిపోయిన భగవాన్‌దాసుగారి అబ్బాయితో మధ్యవర్తుల ద్వారా వందనకు సంబంధం కుదిరింది కుర్రాడు ప్రసాద్ చాలా బుద్ధిమంతుడూ,



అందమయినవాడూ పిల్ల సుఖపడుతుంది అనుకున్నాను భగవాన్‌దాసుగారికి పిల్లలులేకపోవటాన ప్రసాద్‌ను దూరపు బంధువులనుండీ పెంపకానికి తీసుకొచ్చారు ప్రసాద్ వచ్చిన ఎనిమిది ఏళ్ళకు వాళ్ళకు అందాలబొమ్మ విజయ పుట్టింది అసలే ప్రసాద్‌ను అతిభయంతో పెంచిన ఆ దంపతులు, విజయ పుట్టగానే అతన్ని చాలా చిన్నచూపు చూసేవారు కానీ, విజయకు మాత్రం అన్నయ్య ప్రాణం ప్రసాదు బ్యాంక్‌లో ఉద్యోగం చేస్తున్నాడు అతని రేటు పదిహేను వేలు చెప్పారు పిల్లవాడ్ని వదులుకోలేక వాళ్ళు ఎంత కాదన్నా కాళ్ళావేళ్ళా పడి ఎనిమిది వేలకు ఒప్పించాను మీ పిన్ని పోయాకా దాని బంగారం, వందన బంగారం అంతా కలిపి పది కాసులు వందనకే పెట్టాను నాకున్న ఆ కాస్త పొలం అమ్మాను పదివేలు వచ్చింది ఉన్నంతలో దర్జాగా చెయ్యాలనే ప్రయత్నించేనమ్మా కానీ దురదృష్టం అన్నింటా ఎదురయింది ప్రధానం రోజు అయిదు వేలు యిచ్చాను మిగతా మూడు వేలూ పెళ్ళిపందిట్లో యిచ్చేలా నిర్ణయమయింది విడిదిలోకి వచ్చింది మొదలు అవి బాగులేవు, ఇవి బాగులేవు అంటూ ఏడిపించటం మొదలుపెట్టారు పెండ్లివారు ఆడపిల్లని కన్నాకా తప్పుతుందా అనుకుని అన్నీ భరించాను చివరికి ముహూర్తం టైమ్‌కి ఇవ్వాలని పెట్టెలో భద్రంగా మూట కట్టి వుంచిన కట్నం మూడు వేలు మాయమయ్యాయి ఎంత వెతికినా కనపడలేదు ఏంచెయ్యాలో తోచలేదు అవతల వియ్యంకుడు డబ్బు యివ్వందే తాళి కట్టడానికి వీల్లేదని గోల చేస్తున్నాడు రెండు, మూడు నెల్లో ఆ డబ్బు ఇర్దుతానని బ్రతిమాలాను వినలేదు చివరికి స్నేహితుల ప్రోత్సాహంతో ప్రసాదు మూడు ముళ్ళూ వేసాడు అప్పుడే వందనను కూడా తీసుకెళ్ళిపోయారు

అప్పటికోసం ఎక్కువ ఆగవలేదు ''ఎందుక మాస్టారూ! అందరి పరుగులు తాహతుకు తగ్గ సంబంధం చూసుకోకూడదూ! అయినా డబ్బు విషయంలో అంత అజాగ్రత్త ఏమిటి?'' అంటూ ఎదురు నాకే నీతులు బోధించారు చుట్టాలూ స్నేహితులూ

'మీరు పెట్టిన మూడు నెల్ల గడువు అయిపోయింది డబ్బు తీసుకురండి లేనిపక్షంలో మీ అమ్మాయిని శాశ్వతంగా మీదగ్గరే వుంచుకోండి ఉత్తర ప్రత్యుత్తరాలకి యింక అవకాశం లేదు ఈ విషయంలో అబ్బాయి నా మాట వింటాడు తప్పనిసరిగా'' అంటూ, ఒకరోజు పిడుగులాంటి లెటర్ వచ్చింది వాళ్ళెరిగేలా తిరిగినా, ఎంత వడ్డీ అయినా యిస్తానన్నా ఎవరూ యివ్వలేదు యిక దాని ఖర్మానికి వదిలేసాను ఆ రోజు రెండు రోజులకు ప్రసాద్ క్యాంప్ వెళ్ళిన సమయం చూసుకుని వందనే నగలన్నీ తీసుకుని పట్టి పిల్లను పంపేసేరు వాళ్ళ ఆడబడుచు విజయ పాపం ఎంత గోల చేసినా, వందన ఎంత బ్రతిమాలినా వినకుండా బయటకు గెంటేసారు దాన్ని వంటరిగా

ఆశ చావక అల్లుడ్ని అయినా బ్రతిమాలకుండా మరి ఆత్మాభిమానం చంపుకుని బయల్దేరాం నేనూ, వందనా కానీ ''డబ్బు లేకుండా మళ్ళీ పిల్లని తీసుకువచ్చావా! సిగ్గులేదూ?'' అంటూ నోటికొచ్చిన మాటలన్నీ మాట్లాడి మా యిద్దర్నీబయటకు పంపేసారు మళ్ళీ నెలకి నీ కూతురికి విడాకులూ, నా కొడుక్కి మళ్ళీ పెళ్ళి చేస్తాను అంటూ రంకెలు వేసాడు మా వియ్యంకుడు అడ్డువచ్చిన విజయనూ, ప్రసాద్‌నూ గదిలో త్రోసి గొళ్ళెం వేసారు నరరూపంలో వున్న రాక్షసులమ్మా వాళ్ళు ఆ రాక్షసులమధ్య వుంచలేక, దాని కాపురం నాశనమయిందన్న బాధతో తిరిగి యింటికి బయల్దేరాం ఇంతలో నువ్వు కనబడ్డావ్'' అంటూ కళ్ళు తుడుచుకున్నారు పరంధామయ్యగారు

''శశీ డార్లింగ్'' అంటూ కారు తాళాలు విలాసంగా వూపుకుంటూ వచ్చిన రవీంద్ర, అక్కడ అపరిచితుల్ని చూసి ఠక్కున ఆగిపోయాడు అతని వెనకే వస్తున్న విద్యాసాగర్ కూడా ఆగిపోయాడు

''ఏమిటలా చూస్తున్నారు ఈవిడ నా ప్రాణ స్నేహితురాలు వందన ఆయన ఆమె తండ్రి పరంధామయ్యగారు చిన్నప్పటినుండీ వందన నాకు మంచి స్నేహితురాలు'' అంది

''ఈయన మా శ్రీవారు రవీంద్ర, డాక్టర్ ఇతను మా అన్నయ్య విద్యాసాగర్, ఇంజినీర్

# హార్లిక్స్
# మీకు ఎక్కువగా అవసరమయినప్పుడు శక్తినిచ్చే కీలకపోషక పదార్థం.







### గర్భవతిగా ఉన్న కాలంలో

గర్భిణీ స్త్రీకి మంచి సమతూకంలో ఉండి, తేలిగ్గా జీర్ణమయ్యే ఆహారం అవసరం. అందువల్లనే గర్భిణీగా ఉన్నప్పుడు హార్లిక్స్ ఆదర్శప్రాయమయిన ఆహారం ఇది తల్లికి, పిల్లకి కూడా శరీర నిర్మాణానికి కావలసిన మాంస కృత్తులు, కార్బోహైడ్రేట్లు సరిఅయిన సమ తూకంలో సమకూరుస్తుంది రాత్రిళ్ళు సేవించిన మలబద్ధకం ఉండదు ఉదయమే నిస్సత్తువగా ఉండటం పోతుంది




### అస్వస్థత / అస్వస్థనుంచి కోలుకునే కాలంలో

జబ్బు చేసినప్పుడు మీ శరీరం ఎంతో విలువయిన మాంసకృత్తులు, పోషక పదార్థాలు కోల్పోతుంది దీనివల్ల నిస్సత్తువ ఏర్పడుతుంది ఈ నష్టాలను భర్తీ చేసేందుకు హార్లిక్స్ తేలిగ్గా జీర్ణమయ్యే రూపంలో శరీర కణాల నిర్మాణానికి కావలసిన మాంస కృత్తులు శక్తినిచ్చే కార్బోహైడ్రేట్లు ఖనిజాలు సమకూరుస్తుంది దీనివల్ల మీరు త్వరగా కోలుకొంటారు మళ్ళీ జబ్బు పడకుండా తట్టుకునే శక్తి ఏర్పడుతుంది

## ప్రపంచమంతటా డాక్టర్లు సిఫార్సు చేశారు
## హార్లిక్స్ మంచి పుష్టికరమైనది

# ఈ అనుభవం చాలు

స్టేట్స్‌లో వుంటున్నాడు మంచి మంచి సంస్కార భావాలు కలవాడు విజయని ఈ అన్నయ్యకే ఇస్తున్నారు'' అంటూ పరిచయం చేసింది

చిన్నప్పటినుండీ శశితో స్నేహమయినా, ఎప్పుడూ శశి ఇంటికి వెళ్ళేదికాదు వందన ఎక్కువగా శశే వందన ఇంటికి వచ్చేది అందువల్ల వీళ్ళు వందనకు అపరిచితులే లందరి దగ్గరా సెలవు తీసుకుని బయల్దేరారు వందనా,పరంధామయ్యగారూ

''బావగారూ ! విడిదిలోకి వచ్చిందగ్గర్నుంచీ మీరంతా చాలా ముభావంగా వున్నారు నా వల్ల తెలియక ఏదయినా పొరపాటు జరిగితే క్షమించండి నాకున్నది విజయ ఒక్కర్తే కూతురు ముద్దూ ముచ్చట దానిక్కాక ఇంకెవరికి జరుపుతాను అల్లుడు అలకపాన్పు మీంచి దిగిరానంటున్నాడు స్కూటర్ కావాలంటున్నాడు ఇప్పుడు కొనివ్వలేను రెండు, మూడు నెలల్లో ఇస్తాను కనికరించండి బావగారూ'' అంటూ బ్రతిమాలుతూన్న భగవాన్ దాస్‌ని చూస్తే విజయ మనసు ప్రతీకారం చేసానన్న తృప్తితో నిండిపోయింది ఒక మంచి పనికి తనతో సహకరించిన అన్నా, అమ్మా, నాన్నలను మురిపెంగా చూసుకుంది శశి

పౌర్ణమి వెన్నెల డాబామీద పిండారబోసినట్టుగా వుంది చెక్కిట చెయ్యి చేర్చి అజంతా సుందరిలా వున్న విజయ దగ్గరకు వచ్చి కూర్చుంది శశి ''ఏమిటి వదినా ! అలావున్నావు ! ఇంటిమీదకు దృష్టి మళ్ళిందేమిటి ?'' అంది విజయా, శశీ ఒకే ప్రాణంగా కలిసిపోయారు విజయను అందరూ అపురూపంగా చూస్తారు ఆ యింట్లో

''శశీ ! మీరంతా ఎంతో ప్రేమగా చూస్తున్నారు మీ ఇంటికి కోడలిగా రాగలిగిన నేను నిజంగా ఎంతో అదృష్టవంతురాల్ని కానీ మా అన్నయ్య గురించే నాకు బెంగ వాడు వట్టి అమాయకుడు నాన్నగారి ముందు పిల్లిలా వుంటాడు పాపం వందన వదినా, అన్నయ్య ఎంతో ప్రేమగా వుండేవారు పాపిష్టి కట్నం డబ్బులు కోసం వాళ్ళని నిర్దాక్షిణ్యంగా విడదీశారు నాన్నగారు ఈ వరకట్న పిశాచికి ఎన్నో జీవితాలు ఇలా బలియి పోతున్నాయి దేశం పురోగమిస్తోంది, నాగరికత పెరుగుతోంది, మానవుడు ప్రగతి పథానికి పయనిస్తున్నాడు అని అనుకోవడమే తప్ప ఎక్కడుంది ప్రగతి ? ఏ విషయంలో పురోగమించాడు మానవుడు ? తన కొడుక్కి వుగ్గుపాలనుంచీ ఖర్చుపెట్టిన డబ్బుకు కూడా వధువునుండే వసూలు చేయడమేనా ప్రగతి ? డిగ్రీలకి మార్కెట్లో రేట్లను నిర్ణయించడమేనా ప్రగతి ? నాగరికంగా అలంకరించుకున్నంత మాత్రాన, సంస్కారం కలిగిందా మనిషిలో ఎక్కడ వుంది సంస్కారం శశీ ! నన్ను పిచ్చిదానిగా అనుకోకు మా అన్నా, వదినలను కలిపి మా నాన్న లాంటి వాళ్ళ కళ్ళు తెరిపించేవరకూ నాకు మనశ్శాంతి లేదు ''

* * *

''ఏమేవ్ ! నిన్నే చూడు ఎవరొచ్చారో !'' అంటూ పేపరు చదువుకుంటున్న భగవాన్‌దాసుగారు సూట్‌కేసు చేతొ పట్టుకుని గుమ్మంలోకి వచ్చిన విజయని చూసి ఒక కేక పెట్టారు

''నా తల్లే ఎన్నాళ్ళకమ్మా వచ్చావు విజయ తల్లీ నువ్వులేని ఇల్లు చిన్నబోయిందే అమ్మా'' అంటూ కళ్ళు తుడుచుకుంది కామేశ్వరమ్మ ''మీ ఆయనేరీ ? అతనికి సెలవు దొరకలేదా ?'' అంటూ ఇంకా ప్రశ్నలు వెయ్యబోతున్న తల్లితో —

''అమ్మా ! మీరు స్కూటరు కొనిమ్మని ఎన్ని ఉత్తరాలు రాసినా 'ఇంకా డబ్బు జతపడలేదు, ఇంకోసారి ఇస్తాను' అంటూ రాసిన లెటర్స్ చూసి మా మామగారు స్కూటరు డబ్బూ, మా సంసారానికి కావలసిన ఫర్నీచరూ, పాత్ర సామానుకి అవసరమయిన డబ్బు తీసుకుని రమ్మన్నారు డబ్బు లేకపోతే రావద్దన్నారమ్మా'' అంటూ కళ్ళు తుడుచుకుంది

అప్పుడే ఆఫీసుకు బయల్దేరబోతున్న ప్రసాద్ చెల్లెల్ని ఆప్యాయంగా పలకరించాడు

''మీ మామగార్కి లెటర్ రాసాను గదా! త్వరలో ఇస్తానని నా అలస్యానికి వడ్డీయా ఏమిటి మిగతా డబ్బు నీ పెళ్ళికే తాటాతూటం చేసి, అన్నయ్యచేత లోన్లు అన్నీ పెట్టించి తిప్పలు పడ్డాను ఏదో లక్షాధికార్లు కట్నం లేకుండా నీ అందం చూసి చేసుకున్నారు, నీ అదృష్టం అనుకున్నాను లేకుంటే వాళ్ళతో మనం తూగగలమా సరేలే నువ్వు లోపలికెళ్ళి విశ్రాంతి తీసుకో'' అంటూ చెప్పులేసుకుని బయల్దేరాడు

'అబ్బాయ్ ! అల్లుడు ఉత్తరం రాసాడు అంటూ తల దువ్వుకుంటున్న ప్రసాద్‌ను పిలి యిచ్చారు ''మీరు వారం రోజుల లోపుం డబ పంపకపోతే మీ అమ్మాయి శాశ్వతంగా మీ ఇంట్లో వుంటుంది'' అని రాసాడు విద్యాసాగర్ ''ఎం ప్రయత్నించినా ఎక్కడా అప్పు పుట్టలేదురా ఆడపిల్లను ఎందుకు కన్నానా అని యిప్పుడ ఏడుస్తున్నాను పాపం, వందన తండ్రి కూడ యిలానే బాధపడివుంటాడు ఆయన వుసురు కొట్టింది నా చిట్టితల్లికి నిజమే! వరకట్న పిశాచం ఆడపిల్లల తండ్రుల్ని జలగలా పీల్చేస్తోంది పాపం ఆ అమ్మాయి ఎంత బాధపడుతోందో'' నెమ్మదిగ అనడం మొదలెట్టారు భగవాన్‌దాస్‌గారు

తండ్రిలోవస్తూన్న మార్పుకి విజయ ఎంతగాన సంతోషించింది తండ్రికి వంతపాడి వందనను నరకయాతన పెట్టిన అమ్మ కూడా పదే పదే ''నట్టింటి మహాలక్ష్మిలా తిరుగుతూ,చెయ్యి ఆసరగా వుండే పిల్లను పాడు డబ్బు కోసం దూరం చేసుకున్నాము ఆ డబ్బు శాశ్వతమా, ఏమన్నానా ? ఛీ ! ఎంత పని చేసాం '' అనుకుంటూ విజయ దగ్గర బాధపడసాగింది

''అబ్బాయ్ ! ఋవాళ ఆఫీసుకి లీవు పెట్టి కోడల్ని, బావగార్ని వెంటపెట్టుకు తీసుకురా '' అన్నారు ఆఫీసకి బయల్దేరుతున్న ప్రసాద్‌తో తండ్రిలో వస్తున్న మార్పు గమనిస్తున్న ప్రసాద భగవంతునికి కృతజ్ఞతలు తెలుపుకుంటూ బయల్దేరాడు

భుజాలనిండా పమిట కప్పుకుని, చిక్కిపోయినా ఎంతో అందంగా వున్న వందనా, తండ్రీ రిక్షాలోంచి దిగారు ఆశ్చర్యంగా చూస్తున్న ప్రసాదుకు నీరసంగా, శుష్కించిపోయిన వందనను చూడగానే ఆనందం, బాధా అన్నీ ఒకేసారి కలిగాయి వాలిన అతని చేతుల్లో వాలిపోయి, ఎవరు విడదీస్తారో తమని అన్నంత భయంగా అతన్ని కరుచుకుపోయింది ఆ దంపతులను చూసిన అందరి కళ్ళూ ఆనందంతో చెమర్చాయి ''బావగారూ ! అన్యాయం మీకోసం యింత కష్టపడి నాటకమాడిన మమ్మల్ని పలకరించ నయినాలేకుండా మరీ అలా ఊహాలోకాల్లో తేలిపోవడం బాగులేదు '' అన్నాడు అప్పుడే వచ్చిన విద్యాసాగర్ తండ్రిలో వస్తున్న మార్పును చూసి, అటు వదినకూ, ఇటు భర్తకూ, శశికీ అందరికీ పెళ్ళి గ్రామ లిచ్చింది విజయ

''నిజమే విజయా ! ఎండిపోతున్న మా బ్రతుకులను చిగురింపచేసారు చిన్నదానివయినా ఎంతో వివేకవంతురాలవు మీకు మేం చిరకాలం కృతజ్ఞులం'' అన్నాడు ప్రసాదు

''వట్టి కృతజ్ఞత కాదు, మా అబ్బాయికి మీ అమ్మాయినివ్వాలి'' అన్నాడు విద్యాసాగర్ ఆ యింట దివ్య దీపావళే జరిగింది ఆ రోజు

చిన్నదానివయినా నా కళ్ళు తెరిపించావమ్మా విజయా ! ''నాకీ అనుభవం చాలు'' అన్నారు దాసుగారు



డాక్టరుగారూ! మా బొమ్మ
పాపాయికి వంట్లో
బాగాలేదు. కొంచెం చెక్ చేసి
చెప్పండి సార్.

జ్వరంలాంటిదేంకాదు.
కడుపులోనే ట్రబుల్.
ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్
ఇవ్వండి. తగ్గిపోతుంది.

ఇది వర్షాకాలం
కదా డాక్టర్.
ఉడ్‌వర్డ్స్ గ్రైప్
వాటర్ ఇవ్వవచ్చా?

దానికేం? ఎండాకాలమైనా, వర్షాకాలమైనా
చలికాలమైనా, ఏ కాలమైనా సరే.
పిల్లలకు కడుపులో ఎలాంటి ట్రబుల్
వచ్చినా ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్
ఇవ్వండి.






**100** ఏళ్లుగా మాతృలోకం
విశ్వసించినది

# ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్

CAS/OPPL/3/80/T



బస్సాగిపోయింది — సడన్‌గా!

బస్సులో — కొందరి నిద్దట్లో పెడుతున్న గుర్రులాగిపోయేయి!

నిద్రరాని వాళ్ళ కబుర్ల జడివాన కూడా ఆగిపోయింది! కబుర్లులేని వాళ్ళ ఆలోచన ప్రవాహం ఆగిపోయింది! ఆలోచనా కూడా లేక బయటికి చూస్తూ కూర్చున్నవాళ్ళ ప్రకృతి పరిశీలనకి భగ్నం కలిగింది. అంతా స్తంభించిపోయింది కొన్నిక్షణాలు. మెల్లి మెల్లిగా మళ్ళీ చైతన్యం వచ్చింది పరిసరాల్లో.

"బస్సాగిపోయిందేం చెప్మా!" ఓ యిల్లాలి స్వగతం.

"ఏమో..." మరో ముసిలాయన విసుగు.

"చెడిపోయింది గావాల!" అప్పలమ్మ ఊహ.

"ఎప్పటికి బాగవుద్దో!" ప్రయాణీకుల స్పృహ.

"ఇంతదూరం విక్షేమంగా వచ్చి దేం ఖర్మ!"

"బయలుదేరేటప్పుడు నాలుగూ చూసుకోవద్దూ!" అని ఒకరంటే, "వాళ్ళేం చేస్తారుసార్, మన బ్యాడ్‌లక్!" అని మరొకరు.

"దిగాలా?" మధ్యలో ఒకరి ప్రశ్న.

"ఆఁ.. దిగండి దిగండి" — కండక్టరు కేకతో అందరూ దిగిపోయేరు — ఒకళ్ళిద్దరు తప్ప. ఆ ఒకళ్ళిద్దర్లో ఒకర్తి ముసిల్తి — చచ్చిపోతే దిగదది! రెండోది సుమిత్ర. ముసిల్తి కాదుగాని సుమిత్రకి దిగాలనిలేదు. బస్సు అలా ఆగకుండా పరుగెడుతూ తొందరగా గమ్యం చేరుస్తే బాగుణ్ణు అనుకుంది!

అంటే మిగతావాళ్ళకి, తొందరగా ఇంటికి చేరకపోవడం సరదా అని కాదు! ఎవరి తొందర వాళ్ళకుంది. కాని ఇప్పుడు సుమిత్ర తొందర వేరు, పరిస్థితి వేరు! అది— మరొకళ్ళకి చెప్పుకొనేది కాదు. కండక్టరు సుమిత్ర దగ్గిర కొచ్చి మర్యాద ఒలికిస్తూ చెప్పాడు— "తమరు కూడా దిగితే టైరు మార్చాలి. పది నిమిషాల్లో అయిపోతుంది." ఆ మర్యాద సుమిత్రకి కాదు. సుమిత్రని అనబడుతున్న ఆ ఖరీదైన ఫ్యూర్ సిల్కు చీరకీ, ఆ చేతిలోని బరువైన పర్సుకీ, ఆ పక్కనున్న అందమైన బ్రీఫ్‌కీ! సుమిత్రకి దిగక తప్పలేదు. ఏదో సామెత చెప్పినట్టు— కదలని బస్సులో కూర్చున్నా కూర్చోకపోయినా ఒకటే!

పది నిముషాలు అరగంటలో— అరగంట— గంటలో కలిసిపోయేయి. "టైరు మార్చినా లాభం లేదు! ఇంకేదో ట్రబుల్‌ట." చుట్టూ మూగిన జనం చెల్లా చెదరుగా సాగిపోయేరు. క్లీనరు డ్రైవర్ని మెకానిక్ కోసం ఊళ్ళోకి పంపేరు. సుమిత్ర చుట్టూ చూసింది— కూర్చుందికి జాగా కోసం! చుట్టూ ఏవో రాళ్ళూ, పిచ్చిమొక్కలు! చేతిలో బ్రీఫ్— దాని ఉపయోగమూ బ్రీఫే! ఏ బెడ్డింగో ఉంటే ఇలాంటప్పుడు, కూర్చుందికి పనికొచ్చేది! ఐనా పొద్దున్న బయలుదేరి సాయంత్రం తిరిగి వచ్చే ప్రయాణానికి బెడ్డింగెందుకు? సుమిత్ర వాచీ చూసుకుంది. ఈ పాటికి

# డెట్ బిళ్ల వాడండి, తెలుపును పొందండి

ఇపుడు ముందుకంటే
ఎంతో ఎక్కువ మంది
డెట్ బిళ్ల యొక్క
ఉజ్వలమైన ఉతుకును
ఇష్టపడుతున్నారు;
వారంటారు,
ఇది మిరమిట్ల తెలుపును,
ఎంతో ఎక్కువగా
పొదుపును ఇస్తుంది.




# డెట్ బిళ్ల

హాయిగా యింట్లో...పాపతో... "ఛీ! వెధవ బస్సు — అనకాపల్లి పొలిమేరల్లో ఆగిపోయింది." సుమిత్రకి విసుగ్గానూ, బెంగగానూ వుంది.

## వాన వెలిసింది!

"ఎంతసేపని నిల్చుంటారమ్మా! ఆ కిళ్ళీ బడ్డీకాడికెళ్ళి కూర్చోరాదా ?" గొంతు విని పక్కకి చూసింది సుమిత్ర. వెంటనే అసహ్యంతో ముఖం పక్కకి తిప్పుకుంది. "అసలే చిరాగ్గా వుంటే ఇదొకరి." ఇందాక బస్సులో తన పక్కనే కూర్చుంది.

పట్టు రుమాలు పక్కనే అలుగు దగ్గర ఆరేసినట్టు! 'ఇంటిమేట్'ని డామినేట్ చేస్తూ చెమటవాసన! ఎత్తుపళ్ళూ, లోతుకళ్ళూ, బిండిపోయిన చెంపలూ! గడక్కరకి చీర కట్టినట్టూ ఆకారం! ఆ కర్రని పట్టుకు వేళ్ళాడుతున్న గొంగళిపురుగులా ఒళ్ళో ఓ చంటిపిల్ల, మరోసారి చూస్తే వాంతొచ్చేట్టు వుంది సుమిత్రకి. గాదూ మరి? అందం ఆరోగ్యం—ఐశ్వర్యం! మూడూ కలిపి ముద్దచేసి మలిచినట్టూ వుంటుంది సుమిత్ర! మరోసారి చుట్టూ చూసింది

ఎదురుగా. సగం ఆపరేషన్ చేసి వదిలిపెట్టబడిన పేషంట్‌లా బస్సు!

దూరంగా ఓ పెద్ద చెట్టూ— దానికింద టీ బడ్డీ! దాని ముందు ఓ చెక్కబెంచీ! నాసిరకం కొంతమంది జనం!

ఓపికున్నవాళ్ళు ఊళ్ళోకి నడిచిపోతున్నారు.

సుమిత్ర చెట్టువేపుకి దారితీసింది.

టీబడ్డీకి కొత్త చైతన్యం వచ్చింది.

చెక్కబెంచీ మీద జనం పక్కకి సర్దుకున్నారు, సగౌరవంగా ఆహ్వానిస్తూ!

సుమిత్రకి అక్కడ కూర్చోవాలని లేదు టీబడ్డీ వాడు తినేసేలా చూస్తున్నాడు! చెట్టు మొదట్లో ఓ రాయి వెతుక్కొని కూర్చుంది పక్కనే గడక్కర్రా— సంతానం! మట్టిలోనే కాళ్ళు జాపుకు కూర్చుంది "ఛీ! ఇక్కడా తయారు! రామేశ్వరం వెళ్ళినా శనేశ్వరం తప్పనట్టు!" సుమిత్ర మొహం తిప్పుకుంది. దూరంగా ఊళ్ళో లైట్లు కనబడుతున్నాయి "నడిచిపోతే... అబ్బే... లాభం లేదు! చాల దూరం... అలా కనిపిస్తుంది గాని!" సుమిత్ర ఆలోచనలు మొదటి కొచ్చేయి చటుక్కున. చీకటిలాగా మనస్సులో బెంగ, గుబులు మెల్లి మెల్లిగా ఆవరిస్తున్నాయి. ఏవో భయాల నీడలు కళ్ళముందు కదులుతున్నాయి పాప... ఏం చేస్తోందో!

ఏడుస్తోందో? ఏమో...

ఇంట్లో వదలి రావడం...చాల పొరపాటై పోయింది. బొత్తిగా నెల్లాళ్ళ పసిగుడ్డు—ప్రయాణంలో నలిగిపోతుందని.. ఐనా ఎవరికి తెలుసు ఇలా అవుతుందని! పోన్లే... బసు బాగయిపోతే తొందరగా పోవచ్చు ఇంటికి—అంతదాకా ఓర్చుకోవాలి మరి! అసలెప్పటికేనా కదులుతుందా అది! బయల్దేరిన వేళ బాగు లేదు! ఫ్రెండ్ పెళ్ళి... తప్పనిసరి పరిస్థితి మరి! ఇలా అవుతుందని అనుకోలేదుగా!

ఇప్పుడేం చెయ్యడం? ఒళ్ళంతా... ఏదోలా... జ్వరం వచ్చినట్టూ...చెప్పలేని బాధ! పాప... పాలు... తలుచుకుంటే నరాలు జివ్వున లాగుతున్నాయి. భరించడం కష్టంగా వుంది.

ఎక్కడో పాప ఏడుపు...! తన భ్రమా? ఊహూఁ కాదు. నిజంగానే... చంటిపాప... ఏడుస్తోంది! ఎక్కడ్నుంచి? మనసులోనా? పక్కన. కూడా! పక్కనుంచే వినబడుతోంది. ఎవరది... అయ్యో! తన పాప కాదు! అదే... ఇందాక బస్సులో— పక్కనే కూర్చుంది... గొంగళి పురుగు! గుక్కపట్టి ఏడుస్తోంది. ఆకలా? ఏం... గొంగళి పురుగులా వుంటే మాత్రం ప్రాణం లేదూ? ఆకలుండదూ! అబ్బ! ఏంటేడుస్తోందీ— ఆకలేడుపు! వింటూ వుంటే— "మిల్క్ గ్లాండ్స్" పగిలిపోయి— పాలు కుంభవృష్టిలా కురిసి— మహా ప్రవాహమై—అందులోపడి సృష్టి యావత్తూ కొట్టుకుపోదుకదా! జాకెట్టంతా తడిసి ముద్దవుతోంది! ఏం చెయ్యడం! ఏదో చెయ్యాలి! అయ్యో! మేఘాలు ఎలా గర్జిస్తున్నాయో— వానొచ్చేలా వుంది— ఇదొకటా? అంతలా ఏడుస్తూ వుంటే— ఆ తల్లి ఏం చేస్తోంది! ఇంతసేపు ఇక్కడే వుందిగా... ఎటుపోయింది! చంటిపిల్లని ఐదేళ్ల గుంట ముండ కప్పజెప్పి ఎటో పోయింది! బుద్ధి లేకపోతే సరి! తనకుందా? తనకి లేనిది బుద్ధి కాదు... అనుభవం!

ఇప్పటికి అన్ని అనుభవాలు అయినాయి— ఇది తప్ప!

చదువు— పెళ్ళి— పాప— పాలు!

దేనికదే కొత్త అనుభవం!

సుమిత్ర— ఎమ్. ఏ. ఎకనామిక్స్! పైగా ఫస్ట్‌క్లాస్!

ఐతే మాత్రం?

ఈ క్షణంలో— చెట్టుకింద— చీకట్లో— ఈ బాధకి— ఈ సమస్యకి పరిష్కారం...

స్టూడెంట్ లైఫ్‌లో ఎన్నడూ ఆలోచించలేదు. ఏ సెమినార్‌లోనూ చర్చించబడలేదు! ఏ ప్రొఫెసర్ బోధించలేదు!

ఇలాంటివి ఏ యూనివర్సిటీ నేర్పదు!

అనుభవం నేర్పుతుంది. ఎవరో అన్నారు వెనకటికి—"ప్రకృతియే మన పెద్ద బాలశిక్ష!" ఏం నేర్చుకున్నా అందులోంచే! ప్రకృతి — అనుభవం—ఒకటేనా? ఏమో ... అబ్బబ్బ! ఏడ్చేడ్చి ఛస్తుందేమో! ఎప్పటికీ రాదేం — ఎలాంటితల్లి! తనుమాత్రం! ఇంట్లో పాప... ఇలాంటప్పుడు ఫారెన్ కంట్రీస్‌లో ఐతే ఏం చేస్తారో...ఆడవాళ్ళు! ఏ దేశంలోనైనా ... ఆడదాని సమస్యలు ఒకలాగే వుంటాయి. ఎటొచ్చీ పరిష్కార మార్గాలు వేరు — అవే తెలుసుకోవాలి! అదిసరే—ఇప్పుడేం చెయ్యాలి! దీనేడుపు భరించడం కష్టంగా వుంది!

"ఏయ్! మీ అమ్మేది! ఎటుపోయిందని?" సుమిత్ర అరిచింది.

"మా సెల్లికి పాలకోసం" చంటిపిల్లను సముదాయించలేక కిందామీద పడ్తోంది ఆడపిల్ల.

**ఇంకావుంది!**



## మహాసముద్రాలకి అట్లాస్

సోవియట్ యూనియన్ 'మహాసముద్రాల అట్లాస్'ను ప్రచురించే బృహత్ శాస్త్రీయ కార్యక్రమాన్ని చేపట్టింది. 'పసిఫిక్ మహా సముద్రం', "అట్లాంటిక్, హిందూ మహా సముద్రాలు" అనే పేర యీ అట్లాస్‌కు సంబంధించిన తొలి రెండు సంపుటాలు విడుదలయ్యాయి.

పూర్వపు అట్లాసులు కేవలం సాహిత్య, పటాల ప్రాతిపదికపై రూపొందించబడగా యీ అట్లాస్ విస్తృత సముద్ర శాస్త్ర పరిశోధనలు ప్రాతిపదికపై రూపొందించబడిందని యీ అట్లాసు సీనియర్ ఎడిటర్ అడ్మిరల్ సెర్గీ గోర్షకోవ్ 'లిటరేచర్నయ గెజిటా' పత్రికకు తెలియచేశారు. ప్రపంచ సముద్రాలలో ఉపరితలం మొదలు 5000 మీటర్ల లోతువరకు గల జలాల పరిస్థితిని యీ అట్లాస్ సమగ్రంగా విశ్లేషిస్తుంది. ఈ జలాలలో 16-18 కిలోమీటర్ల మధ్యగల వాతావరణ పరిస్థితిని సైతం సమగ్రంగా తెలియజేస్తుంది.

సోవియట్ శాస్త్రవేత్తలు అందించి పరిశోధనా సమాచారంతో బాటు, సమిష్టి అంతర్జాతీయ కార్యక్రమం పరిధిలో జరిగిన సముద్ర పరిశోధనా ఫలితాలను, శాస్త్రీయ మార్పిడి కార్యక్రమం క్రింద ఇతరదేశాలు అందించిన సమాచారాన్ని సైతం యీ అట్లాస్‌లో ప్రచురించడం జరిగింది.

గత 25–30 సంవత్సరాలలో జరిగిన 70 లక్షలకుపైగా సముద్ర పరిశోధనా ఫలితాలను సేకరించి, క్రమ పద్ధతి ప్రకారం విశ్లేషించి, నావికుల 'లాగ్' పుస్తకాలలోని 30,000 సమాచారాలను పరిశీలించి దాదాపు 2,500 సమాచార చిత్రాలను యీ సంపాదకులు రూపొందించారు.

ఈ అట్లాస్ ప్రధానంగా నౌకాయానానికి ఉపకరించేందుకు ఉద్దేశించినదనీ, అయితే అపారమైన సముద్ర సంపదను అన్వేషించడంలో గూడా యిది సహాయకారి కాగలదనీ యీ అట్లాస్ సీనియర్ సంపాదకుడు సెర్గీ గోర్షకోవ్ చెప్పారు.

## వాన వెలిసింది!

ఇంట్లో పాపకి పాల్లేవు!

చెట్టుకింద పాలకి పాపలేదు!

పోనీ పాపలేకపోతే ఏం...గొంగళీపురుగులా వున్నా పాపేకదా! పెద్ద తేడా ఏంలేదు!

"కుడిఎడమైతే పొరపాటు లేదోయ్"—

పాప గొంగళీపురుగు—

గొంగళీపురుగే పాప—

మొత్తంమీద రెండూ ఒకటే!

"ఏయ్ దాన్నిలా ఇచ్చి, మీ అమ్మని పిల్చుకురా!"

పాల్లేని పాపకి—పాపలేనిపాలకీ—పరిష్కారం ఒక్కటే!

అమ్మయ్య! ఏడుపు ఆగింది!

చీకట్లో అందమైన నిశ్శబ్దం!

వాన! జడివాన! ఎవరాపగలరు?

కురవనీ! ప్రాణం హాయిగావుంది!

పూలతోటలో కాకపోతే—బురదగుంటలో!

ఎక్కడో అక్కడ—కురవడం కావాలి!

ఎంత కురిస్తే అంత హాయి!

అబ్బ! ఒళ్ళు ఎంత తేలిగ్గా వుంది!

వాన వెలిసేక ఆకాశంలా!

"ఏయ్ పిల్లా! దీన్ని తీసుకో! అదిగో మీ అమ్మ ..ఇచ్చెయ్!"

"హమ్మయ్య! ఇక ఫరవాలేదు— ఇంట్లో పాపకి పాలు ఎవరో పడతారు తన బాధ ఎవరు పడ్తారు? తనే పడాలి, తనే పరిష్కరించుకోవాలి తన సమస్యని!

పోన్లే...ఇంక బస్సులెప్పుడు బయలుదేరినా ఫరవాలేదు తనకి" తేలిగ్గా నిట్టూర్చింది సుమిత్ర.

దూరంగా డ్రైవరూ, కండక్టరు కబుర్లు చెప్పుకుంటూ వస్తున్నారు. ఆ వెనకవే క్లీనరు కుర్రాడు, మెకానిక్!

మెకానిక్ బస్సుకింద దూరేడు!

బస్సు బాగవుతోంది... అయిపోయింది!

సుమిత్ర తాపీగా బస్సెక్కింది!

పట్టురుమాలుతోపాటూ, అలుగ్గడ్డ ఎక్కింది. దానితోపాటూ గొంగళీపురుగులు!

ఆకలితీరిన పాపని ఆశ్చర్యంగా చూసుకొంటోంది గొంగళీ తల్లి!

మొహం పక్కకి తిప్పుకొని, వాన వెలిసిన ఆకాశంవేపు చూస్తోంది సుమిత్ర.

బస్సు బయలుదేరింది మళ్ళీ!

## ధర్మపథం

# ఎవరిని పూజించాలి?

— బులుసు వేంకటరమణయ్య

ప్రతి యుగంలోనూ భగవదంశ గల మహాత్ములు అవతరిస్తూ ఉంటారు. ఈ కాలంలో కూడా అన్నిమతాలలోను ఉద్భవించిన మహనీయులు కానవస్తున్నారు. మనలో కొందరు సత్యసాయి భక్తులు, కొందరు వైష్ణవస్వాముల భక్తులు, కొందరు కామకోటి పీఠాధిపతుల భక్తులు. ఈ విధంగానే వేర్వేరు మహనీయులను భక్తిప్రపత్తులతో కొలిచేవారున్నారు. అయితే వీరిలో వాస్తవంగా మనం ఎవ్వరిని పూజింపవలసి ఉంటుంది? ఎవ్వరి యెడల ఎక్కువ భక్తిని చూపాలి? అని కొందరికి జిజ్ఞాస కలుగుతుంది.

అయితే– వీరిలో ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అనే భావం సరియైనదికాదు. అలాంటి భేదం ఉండకూడదు. అందరూ ఒక్కరే అనే అభిప్రాయాన్నే మనస్సులో ఏర్పరచుకోవాలి. సూర్యుడు ప్రాతఃకాలంలో ఉదయించి సాయంకాలం అస్తమిస్తున్నాడు. మర్నాడు మళ్ళీ అదేవిధంగా కానవస్తున్నాడు. అప్పుడు 'నిన్నటి సూర్యుడు వేరు, ఈనాటి సూర్యుడు వేరు' అని మనం అనుకుంటున్నామా? ఇద్దరూ ఒక్కరే అని అనుకోవడం లేదా? ఆ మర్నాడు కనబడే సూర్యుడు కూడా ప్రతిరోజూ కనబడేవాడే అని అనుకుంటున్నాము గదా! అలాటి అభిప్రాయమే ఈ మహాత్ముల విషయంలో కూడా ఏర్పడిఉండాలి.

మరొక ఉదాహరణ:—

మనం ఇళ్ళల్లో దీపాల కోసం, పంకల కోసం విద్యుచ్ఛక్తిని ఉపయోగించుకుంటున్నాము. ఒకటి కాదు— రెండుకాదు— చాలా లైట్లు వెలుగుతున్నాయి. అన్నీ సమానమైన వెలుగునే ఇస్తున్నవి. అప్పుడు ఈ దీపంలోని కరెంటు వేరు, ఆ దీపంలోనిది వేరు. ఇది బాగా ఉన్నది–అది బాగాలేదు అనుకోవడం లేదుకదా! అన్నింటిలోనూ ఉండే కరెంటు ఒక్కటేగాని– ప్రతీదానికివేర్వేరుగా లేదుకదా! ఆ విధంగానే మహాత్ములందరిలోనూ భగవంతుని అంశ ఒక్కమాదిరిగానే ఉంటుంది. లైట్లు వేర్వేరు పద్ధతులలో ఉన్నట్లు వారి వారి పద్ధతులలో వ్యత్యాసం స్థూలదృష్టికి గోచరించవచ్చును.

ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్క మహాత్ముని యెడల ప్రత్యేక గౌరవభావం ఉండవచ్చు. అది ఆ వ్యక్తి మనోగతాభిప్రాయాన్ని బట్టి ఉంటుంది. కానీ, ఇతరులైన మహనీయులు తక్కువవారు, ఈయన మాత్రమే గొప్పవారు అనే సంకుచితమైన అభిప్రాయం ఉండకూడదు. అది వ్యక్తిలోని దురభిమానాన్నే వెల్లడి చేస్తుంది. ఈ విషయాన్ని గ్రహించి మనం మహనీయులనందరిని సమాన భక్తిప్రపత్తులతోనే గౌరవించాలి. ఎక్కువ– తక్కువ భావాలను వెల్లడించడం తగదు. మనస్సులో అట్టి భావానికి అవకాశం ఇవ్వకూడదు. (వరల్డ్ టీచర్ ట్రస్ట్ మాష్టారుగారి సమాధానం ఆధారంగా.)



# వంటలు

## మైదారవ్వ సమోసా

కావలసినవి: బొంబాయిరవ్వ 3గ్లాసులు, పంచదార 2 గ్లాసులు, తురిమిన కొబ్బరి, జీడిపప్పు, కిస్‌మిస్, ఏలకులపొడి - తగినన్ని, నెయ్యి, లేక డాల్డా 1కప్పు, నూనె తగినంత.

తయారుచేయు పద్ధతి: మొదట ఒక గ్లాసు మైదా, ఒక గ్లాసు రవ్వ, కొద్దిగా డాల్డా, నీళ్లు వేసి గట్టిగా పూరీల పిండిలా తడిపి ప్రక్కన పెట్టుకోవాలి.

ఇప్పుడు రవ్వ 3 గ్లాసులు దోరగా వేయించాలి. జీడిపప్పులు కూడ వేయించి రవ్వలో వేయాలి. పంచదార, రవ్వ, జీడిపప్పు, తురిమిన కొబ్బరి, ఏలకులపొడి, కిస్‌మిస్ అన్నీ బాగా కలిపి ఒక ప్రక్కన పెట్టుకోవాలి. ముందు తడిపి పెట్టిన మైదారవ్వ పిండిని పూరీల లాగా వత్తాలి. పంచదార రవ్వ మిశ్రమాన్ని 2 స్పూన్‌లు వేసి ముక్కోణాకారంగా సమోసాలాగా మడవాలి. నూనె బాగా కాగనిచ్చి ఇవి దోరగా కాల్చి తీసుకోవాలి. ఇవి కర కర లాడుతూ ఒక 10, 15రోజులకి కూడ బాగుంటాయి.

— కె. రమా ప్రభాకర్

## తీపి గారెలు

కావలసిన వస్తువులు:— పంచదార లేక బెల్లం — 1 కె.జి, యాలకులు — 10, జీడిపప్పు, బాదం పలుకులు, మినప్పప్పు — అర కె జి.

తయారుచేయు విధానం:— మొదట మినప్పప్పును బాగా మెత్తగా కాటుకలా గారెల పిండికి రుబ్బుకోవాలి. తరువాత అందులో (ఉప్పు వెయ్యకూడదు) బాదం పలుకులు, జీడిపప్పు చిన్న చిన్న ముక్కలు, వేసి బాగా కలిపి ఉంచుకోవాలి. ఆ తరువాత పంచదార కానీ, బెల్లం కానీ లేతపాకం తీగపాకం పట్టుకుని, అందులో యాలకుల పొడి వెయ్యాలి. పాకం తయారయ్యాక, ఈ రుబ్బిన పిండిని చిన్న చిన్న గారెలుగా డాల్డాలో కానీ, రిఫైన్‌డాయిల్‌లో కాని వేసి, ఎర్రగా దోరగా వేయించి, వేడిగా ఉండగానే పాకంలో వేసేస్తూండాలి. ఈ వేడి వేడి గారెలు పాకాన్ని పీల్చుకుని, బాగా ఉబ్బుతాయి.

## డబల్ మిఠాయి

కావలసిన వస్తువులు:— మోడర్న్ బ్రెడ్ — పెద్ద ప్యాకెట్లు రెండు, పంచదార — కెజి., పాలు — ఒకటిన్నర లీటర్లు, మిఠాయిరంగు.

చేయు విధానము:— మొదట పాలను బాగా కాచాలి. తరువాత ఆ పాలలో విడి విడిగా రొట్టె ముక్కలను ఒక్కొక్కటే వేస్తూండాలి. ముక్కలన్నీ ఆ వేడి వేడి పాలను పీల్చుకుని, నాని, బాగా ఉబ్బుతాయి. అప్పుడు పంచదార తీగపాకం పట్టుకుని, అందులో మిఠాయిరంగు కూడా వేసి, బాగా కలిపి, ఈ బ్రెడ్ ముక్కలను జాగ్రత్తగా విరిగిపోకుండా అందులో (ఆ పాకంలో) వెయ్యాలి. పాలల్లో నానిన ఈ బెడ్ ముక్కలు పాకాన్ని పీల్చుకునీ, బాగా ఉబ్బి, గులాబ్ జామ్‌లా చక్కగా వస్తాయి.

— జి. రామలక్ష్మి

# హైదరాబాద్ నోట్‌బుక్

**తిరుమల రామచంద్ర**

## శ్రీ లక్ష్మణ శాస్త్రికి శ్రద్ధాంజలి

జనవరి 10 వ తేదీన దివంగతుడైన విద్వత్కవి శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రికి జనవరి 23 వ తేదీ సాయంకాలం శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో నగరంలోని 14 సాహిత్య సాంస్కృతిక సంస్థలు—శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం, సురభారతి సమితి, సాహిత్య అకాడెమీ, తెలుగు భాషా సమితి, అంతర్జాతీయ తెలుగు సంస్థ ఆంధ్ర సారస్వత పరిషత్తు, నవ్య సాహితీ సమితి విశ్వసాహితి, అఖిలభారత తెలుగు రచయితలసంఘం ప్రాకృత అకాడెమీ, శ్రీ వేంకటేశ్వర వేదాంత వర్ధన్ సంస్కృత కళాశాల, భారత గుణవర్ధకసంస్థ సాధన సమితి, జానపద సాహిత్య పరిషత్తు శ్రద్ధాంజలి ఘటించాయి

రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామి అధ్యక్షత వహించారు, శ్రీ లక్ష్మణ శాస్త్రితో తమకు గల పరిచయాన్ని, ఆయన పాండిత్యాన్ని ఆయన వివరించారు సరస్వతీపుత్రుల శ్రీయుతులు అప్పా సత్యనారాయణరావు, దివాకర్ల వెంకటావధాని ప్రమోద్ గణేశ్‌లాల్వే, దేవుల పల్లి రామానుజరావు, పుల్లెల శ్రీరామచంద్రుడు, ఇరివెంటి కృష్ణమూర్తి, నాయని కృష్ణకుమారి, కేశవపంతుల నరసింహ శాస్త్రి, జీనత్ సాజిదా, ముదిగొండ వీరభద్రమూర్తి, అక్కిరాజు రమాపతిరావు, బి రామారావు, ధర్మపురి శేషగిరిశర్మ రవ్వ శ్రీహరి, పప్పు లక్ష్మణ శాస్త్రి, నీలా జంగయ్య, రాజన్నశాస్త్రి ఎం. ఎల్. నరసింహారావు, శ్రీ లక్ష్మణ శాస్త్రి, పాండిత్య, సౌహార్ద్ర, సత్సాంప్రదాయ కార శీలతలను గురించి, ప్రసంగించి శ్రద్ధాంజలి ఘటించారు శ్రీ లక్ష్మణశాస్త్రి కుమారులు డాక్టర్ ప్రభాకరశాస్త్రి, కె వి కృష్ణమూర్తి, కుమార్తె డాక్టర్ కె కమల తమ తండ్రిగారు వదలిన పనులు పూర్తి చేస్తామన్నారు ప్రారంభంలో శ్రీ లక్ష్మణ శాస్త్రి వాణి టేప్ రికార్డులో వినిపించబడింది శ్రీ తిరుమల రామచంద్ర, ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య, విదేశాంగ శాఖామంత్రి శ్రీ పి వి నరసింహారావు, పండితరాజ పట్టాభిరామ శాస్త్రి (వారాణసి), శ్రీ రాజేశ్వర రావు (ఐ ఏ ఎస్ భువనేశ్వర్), మున్నగువారు పంపిన విషాద సందేశాలు వినిపించారు సంతాప తీర్మానం తర్వాత శ్రోతలు మూడు నిముషాలు శ్రీ శాస్త్రి ఆత్మ శాంతి కోసం మౌనం పాటించారు

## స్వామి అగ్నివేశ్ విమర్శ :

హరియాణా జనతాపార్టీ నాయకుడు స్వామి అగ్నివేశ్ జనవరి 24 న పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ, ఆంధ్రప్రదేశ్ నాయకులకు హైదరాబాద్ ఢిల్లీల మధ్య తిరగడానికే సరి పోతుందన్నారు మంత్రివర్గ విస్తరణ విషయంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య, హరియాణా ముఖ్యమంత్రి శ్రీ భజన్‌లాల్ పోటీ పడుతున్నారని, హరియాణాలో అధికార పార్టీ శాసన సభ్యులలో ప్రతి రెండవ వ్యక్తి మంత్రి అని, తక్కిన వారికి కార్పొరేషన్ పదవులని అగ్నివేశ్ అన్నారు అస్సాం ఉద్యమం బాధ్యత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధిదేనని ఆయన అన్నారు

## శ్రీ ఆబిద్ అలీఖాన్‌కు పద్మశ్రీ :

ప్రముఖ జర్నలిస్టు, సియాసత్ దిన పత్రిక మేనేజింగ్ఎడిటర్, ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా డైరెక్టర్ శ్రీ ఆబిద్అలీఖాన్‌కు రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా పద్మశ్రీ బిరుదం లభించింది కళాకారులకు గాని, రచయితలకు గాని, సంఘసేవకులకు గాని ఎలాంటి బిరుదము ...

## రిపబ్లిక్ దినోత్సవాలు :

జంటనగరాలలో రిపబ్లిక్ ఉత్సవాలు మహోత్సాహంగా జరిగాయి సికిందరాబాద్ పెరేడ్ మైదానములో విన్యాసాలను పర్యవేక్షించి సైనిక వందనం తీసుకున్న తర్వాత గవర్నర్ శ్రీ కె ఎ అబ్రహాం ప్రసంగిస్తూ, రాష్ట్ర భవిష్యత్తును ఉజ్జ్వలతరం చేయడానికి ప్రజలు ప్రభుత్వంతో సహకరించాలని కోరారు రాష్ట్ర అభివృద్ధిని సూచించే వివిధ శకటాల ప్రదర్శనం ఎధప గవర్నర్ రాష్ట్రపతి ప్రకటించిన వివిధ పథకాలను పోలీసు అధికారులకు పంచి పెట్టారు విన్యాసాలను ముఖ్యమంత్రి శ్రీ అంజయ్యమున్నగువారు తిలకించారు జంటనగరాలలో వివిధప్రాంతాలలో ఉత్సవాలు ఘనంగా జరిగాయి ఆనంద నగర్ కాలనీలోని ప్రకాశం విద్యా నికేతన్‌లో శ్రీ తిరుమల రామచంద్ర జాతీయ పతాకావిష్కరణ చేశారు శ్రీ ఎ శ్రీహరిరావు అధ్యక్షత వహించారు ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం ఎ ఆర్ వి. రాజారావు స్వాగతం చెప్పారు. విద్యార్థులు ఆలపించిన గీతాలలో 'విజయ రథపు కేతనం ప్రకాశ విద్యా నికేతనం' గీతం శ్రోతలను విశేషంగా ఆకర్షించింది యూసఫ్‌గూడలోని మోడరన్ పబ్లిక్ స్కూలులో బాబూ జగ్‌జీవన్‌రాం విద్యా సంస్థ కరెస్పాండెంట్ శ్రీ బి సత్యం జాతీయ పతాకం ఎగుర వేశారు హవుసింగ్ బోర్డ్ ఎన్ జి ఓ ల సంఘం గృహకల్పలో నిర్వహించిన ఆటల పోటీలో విజేతలకు బోర్డు అధ్యక్షుడు శ్రీ ఎ ధర్మారెడ్డి బహుమతులు పంచి పెట్టారు. వెంగళరావు నగర్ గుడిసె వాసులు జరిపిన ఉత్సవములో శ్రీ జి వెంకటస్వామి పతాకావిష్కరణ చేశారు ఆజమాబాద్‌లో జరిగిన ఉత్సవాలకు రవాణా శాఖామంత్రి శ్రీ వర్దెకాల శేషావతారం రవాణా సంస్థ జనరల్ మేనేజరు పి జగన్మోహన్ హాజరయ్యారు. ఎర్రగడ్డలోని పాండురంగనగర్‌లో సంక్షేమ సంఘాధ్యక్షుడు శ్రీ ఎం రామమోహన్ రావు పతాకావిష్కరణ చేశారు

## ఉ వ్య్ ...

ఏంసార్! ఇతర రాష్ట్రాలలో కళాకారులకు, సంఘ సేవకులకు, రచయితలకు చాలమందికి పద్మశ్రీలు, పద్మభూషణలు వచ్చాయే, మన రాష్ట్రానికి ఎందుకు రాలేదు ? అని ప్రశ్నించాడొక కళాభిమాని. మనం ఎంత గొప్ప వాళ్ళమయితేనేమి? పై వాళ్ళకు తెలియాలి కదా అన్నారు. ... వాడు మనవాడు అయితే అనే ... వచ్చిందా? అని ప్రశ్నించారు ...



# ఒకటో రకంగా అమ్ముడు అవుతూంది ఒక్క 2 ఏళ్ళలోనే

# JOHNSON®

## మిక్సర్-గ్రైండరు

జాన్సన్ వారి అత్యుత్తమ పరికరము. భారతదేశంలో గృహోపకరణాల తయారీలో 25 సంవత్సరాల అనుభవము. జాన్సన్ మిక్సర్ గ్రైండరు. ఇది ప్రవేశపెట్టిన ఒక్క రెండు సంవత్సరాలలోనే నిస్సందేహంగా మంచి విశిష్టమైన బ్రాండు అని సుప్రసిద్ధమైన కీర్తిని పొందినది

ఎందుకంటే చూడండి:



ఉచితము అదనంగా ఎవర్‌సిల్వర్ దవర డ్రైగ్రైండింగుకి ప్రత్యేకంగా వేరే ఎవర్‌సిల్వరు దవర వుండటంచేత మీ మిల్క్ షేకులకు మసాలావాసనల రుచులు అంటుకునే భయముండదు



### ఎక్కువ ఆరోగ్యకరము

సులభంగా విడదీసి కడుగుకోడానికి వీలుగా అన్ని తయారుకావింపబడ్డాయి లోపల ఆహారపదార్థాలు అవటు అంటుకుంటాయనే భయముండదు:



### సమగ్ర భద్రత

రెండు దవరలలోనూ కూడా బ్లేడులు దిట్టంగా అమర్చబడ్డాయి. తిరుగుతున్నప్పుడు బ్లేడులు విరిగి చెదిరిపోతాయనేదేవుండదు.



### హెవీడ్యూటీ పనితనము

అధికంగా బలిష్ఠమైన 450 వాట్లు మోటారు భారతదేశపు వంటరకాలకు ప్రత్యేకంగా డిజైనుకావింపబడింది. 45 నిమిషా ఆగకుండా పనిచేస్తుంది.

### ఇతర ప్రత్యేక లక్షణాలు

- ప్రత్యేకమైన వెంటిలేషనువల్ల మోటారు ఎప్పుడూ చల్లగావుంటుంది
- బాగా శక్తివంతంగా మిక్సింగుకుగాని గ్రైండింగుకిగాని ప్రత్యేకంగా అభివృద్ధి పరచబడిన బ్లేడులు
- ఒకస్పీడు నుంచి మరో స్పీడుకి కష్టంలేకుండా మార్చుకోడానికి ఇన్‌వర్‌సిట్
- పూర్తి 12 మాసాల




**JOHNSON**

**శక్తికి పనితనానికికూడా ఒకటోరకము**

తెలంగాణా & రాయలసీమకు డిస్ట్రిబ్యూటర్లు:

మెస్సర్స్ అపర్ సేల్స్, 8-2-848/1/4 to 6. టూరిస్ట్‌హోమ్ ఎదుట, స్టేషన్‌రోడ్, కాచిగూడ, హైదరాబాద్-50(

కోస్తా ఆంధ్రాకు డిస్ట్రిబ్యూటర్లు:

మెస్సర్స్. సోనోవిజన్ ఎంటర్‌ప్రైజెస్, ఏలూరురోడ్, విజయవాడ-520 002. ఫోన్: 74216.

# వారఫలం

## 27–2–1981 శుక్రవారం మొదలు 5–3–1981 గురువారం వరకు

**మేషం :** వారమంతా యోగదాయకం. తలంచిన కార్యాలు, తలచినట్లుగా జరిగిపోతాయి. పత్రికా ప్రకటన కర్తలు, భారీ వ్యాపస్థులు, చిత్రరంగ వ్యాపారులు, పంపిణీ సంస్థలు అనుకూల ఫలాల నందుకోగలరు. ద్రవ్యాదాయం సంభవం. స్త్రీలకు:- విద్యా వైజ్ఞానిక రంగాలలో ప్రకాశమున్నది. ఉద్యోగం అనుకూలమే.

**వృషభం :** మొదటి రెండుదినాలలో, అనుకొనిన యిబ్బందులు తటస్థించనున్నవి. అధిక వ్యయాన్ని, అనవసరమైన ఖర్చులు, ఆశాభంగమునకు దారితీసే సంఘటనలు తటస్థించనున్నవి. మిత్ర సంభాషణలో, బంధువుల ఇష్టాగోష్ఠిలో ఎంత జాగరూకతతో మెలగితే అంతమంచిది. ఆరోగ్యలోపం కూడా కనిపించగలదు. స్త్రీలకు:- అన్ని రంగాలలో ఫలితం సామాన్యమే.

**మిధునం :** వృత్తి, ఉద్యోగాలు సుకరంగా ఉంటాయి. కార్మిక వర్గానికి అప్రయత్న లబ్ధి గలవారం. వ్యాపారం సర్వ సామాన్యంగా సాగిపోతుంది. భూసంబంధమైన వ్యవహారాలుంటే, పరిష్కరించు కొనుటకు అనుకూలవారమే. క్రీడావనిలో వివిధములైన అవకాశాలుంటాయి. కృషి చేయుండి. స్త్రీలకు.- ఇరుగు పొరుగు వారితో మాట పట్టింపులు, కించిత్తు ఆదాయం చెప్పదగినవారం.

**కర్కాటకం :** మీ సాహిత్య కృషి ఫలిస్తుంది. కావలసినన్ని నూతనావకాశాలుండగలవు. భాగస్వాములతో వ్యాపారం చేసేలాగైతే, ఎలాగైనా మాట పట్టింపులు, అపవాదులు, అనవసరంగా వ్యాకులం, అశాంతి సంభవింపగలవారం. స్త్రీలకు:- శుభకార్య ప్రస్తావనలు, విలువగల నూతన వస్తు సేకరణకు అవకాశం, ఉద్యోగంలో పెంపు సంభవం.

**సింహం :** ఇంజనీరింగు, వృత్తి, వైద్యవృత్తి చేపట్టిన వారికి సుగమంగా, సుకరంగా, లాభదాయకం. నాలుగురాశులు చేతికందాయి, మిగిలినాయి, అనిపించేవారం. వయసు మీరినవారు, ఈ రాశికి చెందిన వారికి హటాత్తుగా అనారోగ్య లక్షణాలు కనిపించవగలవు. ముందు జాగ్రత్త వహించటం ఎంతైనా న్యాయం. స్త్రీలకు:- నూతనోద్యోగావకాశాలు లభించటం, క్రీడారంగంలో అవకాశాలుండుట గమనించగలరు.

**కన్య :** క్రొత్త వస్తువులు కొంటారు. ఇంట శుభ కార్య ప్రస్తావన లుండగలవు. భూసంబంధమైన ఫలితం అందుకోవటంతో గృహం నిత్య కల్యాణ వైభవంతో కళకళలాడుతుంది. రాశి యందు స్థితుడైన గోచార 'శని' పెద్దగా యిబ్బందులు కలిగింపడుగాని, ఆరోగ్యం మీకుగాని, కుటుంబ సభ్యులకుగాని లోపించవచ్చు. స్త్రీలకు - అప్రయత్న ధనలబ్ధి, హటాత్తుగా ధన సేకరణకు అవకాశం, వ్యవహార విజయం చెప్పదగినవారం.

**తుల :** భారీ వ్యాపారమైతే, ఎంతో జాగ్రత్తగా సాగించాలి. అధిక లాభాపేక్షకు పోరాదు. అనేక ఇబ్బందులు ఎదురవుతవి. అన్యాయంగా అపనిందలు నెత్తికెక్కగలవు. అయినవారూ ఏదో నెపంపెట్టి సాధించగలరు. ఉద్యోగం హాయిగా కొనసాగే మార్గమున్నది. స్త్రీలకు:- ఇంటి పనులతో తీరిక లేక పోవడం, చికాకు సంభవం.

**వృశ్చికం :** ధనాదాయం ఉన్నది. వ్యాపారం నూతనంగా సాగించాలనే ప్రయత్నం ఫలవంతం కాగలదు. వెనుక ముందులు ఆలోచించి, పెద్దలతో, అయినవారితో, మిత్రులతో సంప్రదించి మరీదిగండి. కృషి చేస్తే అన్ని రంగాలలో క్రమంగా లాభం పొందగలరు. స్త్రీలకు : విద్యా రంగంలో, ఉద్యోగంలో కావలసినన్ని అవకాశాలు లభిస్తాయి. ఆదాయమున్నది.

**ధనుస్సు :** బంధువుల రాక, ఆనందంగా కాలం వ్యయించడం, కించిత్తు ధనాదాయం, చేసే పనిలో వివిధ మార్గాల లాభం, క్రీడావనిలో అవకాశాలు, వ్యాపార విస్తరణ తలంపు, ఉద్యోగంలో పెంపు చెప్పదగిన వారం. రాజకీయవాదులకు లాభదాయకమైన వారమే. కృషిచేయుండి. స్త్రీలకు : నూతనోద్యోగావకాశాలున్నాయి. ద్రవ్యాదాయం సంభవించే వారం.

**మకరం :** హాయి, ప్రశాంతత, ఆనందం, లబ్ధి, అనేకములు నూతన విషయాలు గ్రహించటం, బంధు వర్గీయులతో, శుభ కార్య నిమిత్తం చర్చించడం, యిత్యాది ఫలితములుండగలవు. మిత్ర సహాయం వలన ఒకానొక ముఖ్యకార్యం సానుకూల పడనున్నది. స్త్రీలకు : పెద్దల ఆదరణ, అభిమానం, మాటకు విలువ, ఉద్యోగంలో ప్రశాంతత, పెంపు చెప్పదగిన వారం.

**కుంభం :** భూములను గూర్చిన తగాదాలు తల ఎత్తగలవు. క్రొత్తవారి స్నేహంలభించగలదు. అప్పులు ఆశించిన ధనం వ్యాపార నిమిత్తమో, కార్యసాధన కొరకో అందించగలరు. రోడ్డుప్రమాదం సంభవించే దినం. తగు జాగ్రత్త అవసరం. స్త్రీలకు : సాహిత్య కళా రంగాలలో చొరవ ఏర్పడుట, విశేష జనాదరణ కనిపించుట వారఫలం.

**మీనం :** ఏదో లబ్ధి ఆశించి, కృషి చేయనున్నారు. అప్రయత్నంగా ధన లబ్ధి గలదు. వ్యాపారస్తులకు ప్రశాంతత చిక్కగలదు. క్రయ విక్రయములలో ఇబ్బందులు తొలగుతవి. ఆశించిన ఫలితం, అన్ని రంగాలలో అందుకోగలరు. చాలా మందికి క్రీడా వనిలో అవకాశాలున్నాయి. సద్వినియోగం గావించుకొనండి. స్త్రీలకు : ఉద్యోగంలో, వృత్తిలో, ఉన్నత విద్యాభ్యాసానికి ప్రోత్సాహం లభించటంలో అనుకూల వారం. ఉత్తమ ఫల ప్రాప్తిగల వారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

**కె. జి. హెచ్. ఎల్. కుప్పం**

మన దగ్గర నుంచి డబ్బు తీసుకునేటప్పుడు ఉండే తొందరగాని, మాటలు గాని, ఆసక్తి గాని డబ్బు చెల్లించేప్పుడు వుండదు. ఎందుకని?

ఎందుకేమిటి? చేతినుంచి డబ్బు పోతూంటేను.

ఆడ పేరుతో రచనలు చేసే మగవాళ్లు చాలా మంది వున్నారు. కాని మగ పేరుతో రచనలుచేసే రచయిత్రులు వున్నారా?

ఉన్నారు. కాని తీరా చెప్తే అచ్చు వేయడం మానేస్తారేమోనని చెప్పడం లేదు.

**కబీరు, అనంతపురం**

మీ బుద్ధి చూస్తుంటే ఆడదానిమాట వేద వాక్యంగా భావించి కూర్చోమంటే కూర్చోడం నించోమంటే నించోడం చేసే మగవాడు చాలా గొప్పవాడు. మంచివాడు అనుకుంటా.

ఎందుకని అడగనివాడు చేతకానివాడే అంటాను. మరీ డ్రిల్ మాస్టర్లాలాకూర్చో, నించోఅంటూ మొగుళ్లనితర్ఫీదుచేయడానికి ఏ ఆడదానికివుంటుందండీ టైము?!

ధనమున్న మీలాంటి వారిని అన్ని సంస్థలలో సభ్యులుగా వుండమంటారు.కాని సామర్థ్యమున్న వారిని తీసుకోరు.

ధనంతో కొనలేనివి చాలా వుంటాయి కబీరు గారూ. డబ్బుండగానే సభ్యత్వంయిస్తే ఏ సంస్థా పదికాలాలపాటు పనిచేయలేదు.వెనకటికి క్లబ్‌వాలా అంటోండ్రే వారు— ఇతరుల కోసం దండడానికి వెళ్లే వాళ్లు ముష్టి వాళ్లలాగా. వెళ్లక్కర లేదని, ఉడుకుబోతుతనం, అసూయ, అసహనం సహృదయత లేక పోవడం, మనిషివెనక మనిషినిగురించి వాగడం, హెచ్చు తగ్గులు పాటించడం, ఇవి ఏవీ సభ్యత్వాన్నే కాదు నేటి మనిషిని కూడా మీ దరి దాపులకు చేరనివ్వవు. డబ్బు, సామర్థ్యం కాదు కావలసింది. సాటి మనిషి పై సానుభూతి. అదీ చాలా ముఖ్యమైనది అని ఎంతమందికి వుంటుంది!

**ఎల్. ఎల్. ఎమ్మిగనూరు**

లోకంలో చాలామంది సుఖ పడరు. ఒకరు సుఖపడినా చూసి ఓర్వలేరు. ఎందుకని ?

మానవ నైజం అది. మారదు.

మానవుని జీవితంలో అత్యంత విలువైన క్షణం ఏది?

పుట్టిన క్షణం. కిట్టిన క్షణం.

వివాహం వార్ధక్యంలాంతా కోరుకుంటారు.తీరా అందాక విచారిస్తారెందుకు?

వివాహం మోయలేని బాధ్యతలని తెస్తే వార్ధక్యం కోరికలని తీరని -కాటేస్తుంది. అందుకే కోరికలో వున్న ఆనందం ప్రాప్తిలో వుండదు.

**వి. ఎస్. ఆర్. ఉయ్యూరు**

నేను మీ అంత రచయిత్రినై జూనియర్ రామలక్ష్మి అని పేరు తెచ్చుకున్నాననుకోండి. మీరెలా ఫీలవుతారు.

అచ్చేసే వారికి గందరగోళం కాకుండా నా పేరు మార్చుకుంటాను.




**హుస్సేన్, రామవరప్పాడు**

మానవుడు పుట్టడం దేనికి? చావడం దేనికి ?

తరం నుంచి తరం సాగడం కోసమే. జీవులు - పుట్టడం— గిట్టడం.

**పి. ఎస్. బి. హైదరాబాదు**

ఒక వర్గాన్ని ఒక సమాజాన్ని ప్రత్యేకించి, పని కట్టుకుని సమర్థించేకంటే-మొత్తం జాతికి దేశానికి మనం ఏంచేశామని అంతా కలిసికట్టుగా ఆలోచించడం మంచిదేమో?

ఆలోచన మంచిదే కాని యీ ఐక్యతామార్జాలానికి గంట కట్టే దెవరు. దాని వల్ల వ్యక్తులకేం లాభం? నాకేం లాభం అని అడుగుతారు. దూరపు కొండలు నునుపని, చూడని సమాజాన్నిక్కడ దాచాలని తాపత్రయమే గాని ఉన్న దాన్ని బాగు చేయాలని తోచదు— వర్గ దృక్పథం ఒక్కటే ఉంటే,

**ఎల్. ఎస్. కుకునూరు**

మహిళలహక్కులు సరిగా వినియోగం కావాలంటే మీ సమాధానాలతో సరిపోదని నా అభిప్రాయం. మీరే కేంద్ర ప్రభుత్వంలో మినిస్టరుగా వుంటే బాగుంటుందనుకుంటున్నాను, మీ అడ్రసు పంపుతారా?

కొంపతీసి ఇందిరకు రాస్తారా ఏమిటి?. తీరా మినిస్టరునైతే— యీ హక్కులూ, గొడవా కబుర్లాడుకుంటూ కూర్చోడానికి టైమెక్కడ దొరుకుతుందయ్యా శ్రీనివాసా! పదవి నిలదొక్కుకునే ప్రయత్నంలో తలమునకలుగా వుంటా!

**ఎస్. బి. ఆర్. బెజ్జవల్లి**

చేద్దైనా తింటా.తీపైనా తింటాననే వ్యక్తి ఎలాంటి వాడు?

గుడినీ గుడిలో లింగాన్ని మింగే వాడైనా అవ్వాలి. లేదా ఏదైనా సద్దుకుపోయేవాడైనా కావాలి. ఏదైనా బ్రతక నేర్చినవాడే నవాలి.

**ఎం. జి. ఎస్. కె. మోరి**

మీ సమాధానాలుచాలా ఘాటుగా వుంటాయి. సమాధానాలు యిచ్చేప్పుడు ఏమైనా నములుతున్నారా ?

ఆ! ఏదోఒకటి నములుతూనేవుంటానుమాటలు తప్ప! ఇది వరకు పళ్లు కొరికేదాన్ని, బటాణీలు నమిలేదాన్ని. కాని ముసలిదాన్ని అయిపోతున్నాను కదా—ఎక్కడ పళ్లు విరుగుతాయోనని పచ్చి మిరపకాయలో,పచ్చి మిరియాలో నములుతున్నాను. అందుకే కాబోలు సమాధానాల్లో కాస్త రుచి మారిందంటున్నారు! మీరేమ...

**జి. వి. ఉరవకొండ**

సుఖానికి పెళ్లం కళ్ళెం,భార్య ...

మరి పిల్లలు ?

ఆ మాత్రం వూహించలేరా? ఉరితాళ్లు!

స్త్రీ జీవితమే నటన అని అంగీకరిస్తారా ?

ఆహా! పురుషుని ప్రవర్తన మాయ అయినప్పుడు స్త్రీ జీవితం నటనే అవుతుంది.

ప్రకృతి పరంగా ప్రేమ యాతనలో అధిక భాగం పురుషునిదా? స్త్రీదా ?

నిస్సంశయంగా స్త్రీదే! కని పెంచడమే కాదు ఈ రోజుల్లో కాపాడుకు వస్తూంది.

**ఎస్. ఆర్. భద్రాచలం**

శబాష్ పాపన్న చిత్రంలో కాలేజీ ఫంక్షనుతో నాగయ్య గారు పరిచయం చేసిన ఆ రామలక్ష్మి మీరేనా?

తెర నిండుగా వుంటే నేనే!



నాకు జబ్బీగా ప్రమోషను రాగానే మా ఆవిడ వంట మనిషిని పెట్టితీరాలని రూల్ పాస్ చేసింది. మొదట్లో నేను వుపేక్ష చేశాను. రాను రాను వత్తిడి ఎక్కువయింది. కామాక్షి యింత యిదిగా యిందుకు బలవంతం చేస్తోందో నాకు అర్థమవలేదు. అమ్మాయిలు ముగ్గురూ అత్తవారిళ్ళలో వున్నారు. అబ్బాయిలు యిద్దరూ వుద్యోగాలమీద దూరంగా వున్నారు. ఇంట్లో వుండేది మేం యిద్దరం.

కామాక్షి అశక్త మనిషి కాదు. పని పరవారు. కామాక్షికి దిగులు పట్టుకుంది.

"ఖర్చు కాదుగాని, నీ అమృతమైన వంట తిన్నాక వంటవాళ్ళ గడ్డి తినగలనా?" పొగిడాను, లొంగక పోతుందాని.

కామాక్షి కోపంగా అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

ఆ రోజు నుంచి కామాక్షి ముభావంగా వుంటున్నది. వర్క్ టు రూల్ ఇంట్లో సందడి లేదు.

సాయంత్రం యింటికి రాగానే కామాక్షి సమర్పయ్యాడు. అరవిందం వంట మా బంధులోకానికి తెలిసిపోయింది. మేమున్నది హైదరాబాదు కనుక, అందరూ ఏదో పని పెట్టుక్కుంటూ వచ్చేవారు. అరవిందం వంట వాళ్ళని వెళ్ళనిచ్చేది కాదు. తిని వూరికే కూచుంటారా? ఇల్లు పీకి పందిరి వేసేవారు. మా కుటుంబ విషయాల్లో, నా ఉద్యోగ విషయాల్లో జోక్యం చేసుకునేవారు. లేదా చిన్న చిన్న కారణాలపై పోట్లాడుకునేవారు. ఇల్లు తిరునాళ్ళయిపోయింది. ఖర్చు పెరిగింది. అశాంతి పెరిగింది.

ఫాస్ట్‌గా వుంది. గారెలు చేదు. అతిథుల త్వరగా చేయి కడుక్కోవడం అలవాటై ఆశ్చర్యమైంది

పొగడ్తకు బదులు తిట్లు. "నలుగురిలో నా పరువు తీశావు కదురా! ఎంతో గొప్పగా చెప్పాను నీ గురించి. ఇలా తగలేశావేం?" కామాక్షి కోపం.

"నేను బాగానే చేశాను అమ్మగారూ."

ఆ రోజు నుంచి అరవిందం వంటపాడుగా, ఘోరంగా వుంటోంది. ముద్ద కదలడంలేదు. అందరూ అరవిందాన్ని తిడుతున్నారు. అరవిందం ఘోరమైన వంట తినలేక బంధులోకం క్రమంగా నిష్క్రమించింది.

"నీకు గర్వం బయలుదేరింది. నీ ఇష్టం వచ్చినట్లు వండి పారేస్తున్నావు. నలుగురిలో తల ఎత్తలేక పోతున్నాను?" కామాక్షి మండిపడింది.

మెచ్చినవారు తిడితే ఎలా వుంటుంది?

"నేను ఎప్పుడూ ఒకలాగానే వండుతున్నా. మీ నాలికలు మారాయేమో. నాకు జీతం యివ్వకపోయినా ఫర్వాలేదు. వంట పాడంటే కోపం వచ్చేస్తుంది. మీరు కాకపోతే మరొకరు. నాకు లోటేమిటి?" అరవిందం ఎదిరించాడు.

"మానెయ్యి డబ్బు పడేస్తే మాకూ బోలెడుమంది. నీ ఒక్కడివే వుందా?" కామాక్షి లోపలికి వెళ్ళి జీతం చేతిలో పెట్టింది.

అరవిందం వెళ్ళిపోయాడు.

ఇది నాకు సంతోషం + విచారం కల్గించింది! మేధావులు విదేశాలకి వలసపోవడంలా అనిపించింది.

శివుడు అప్పుడప్పుడు అరవిందం వంట కాగానే నా ఏర్పాటుతో అనీ యినీ కలిసి

# ఉత్తరాలు

## ముఖచిత్రం

ఈసారి ముఖచిత్రం చాలా బాగుంది. ఈ ఫోటోను నా ఆల్బమ్‌లో పెట్టుకొన్నాను. రాగలహరి సీరియల్ చదవటానికి ఆసక్తిదాయకంగా ఉంది.

అల్లిక వెంకటేశ్వరరావు (ఉప్పాడ)

* * *

మీరు ముఖచిత్రాల విషయంలో శ్రద్ధ తీసుకోవడంలేదని మా ఉద్దేశ్యం. తెలుగు తల్లి కడుపులోని... అప్పట్లో పవిత్ర హిందూదేశంలో ఉండి ముచ్చటగా ఉండే హిందూ నారీచిత్రాలను ప్రచురించక, పైట తొలగిన (ఈసిచిత్రంలాంటివి) 'నారీ ముఖచిత్రాలు వేస్తున్నారు ! ఇకనైనా మన సంస్కృతి ప్రతిబింబించే చిత్రాలను ప్రచురిస్తారని ఆశిస్తున్నాం!

డి. వి. రమణకుమార్, స్నేహప్రియ (మధిర)

## సీరియల్స్

మీరు ప్రచురిస్తున్న రెండు సీరియల్స్ ఇంట రెస్టింగ్‌గా ముందుకు సాగిపోతున్నాయి. ఇంత మంచి సీరియల్స్ ప్రచురిస్తున్న పత్రికకు కృతజ్ఞతలు.

సుజాత [ఇనమన మెళ్ళూరు]

* * *

ఈసారి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రవారపత్రిక బజారులో ఉన్న అన్ని పత్రికలకంటె ఎక్కువ ఆకర్షణీయంగాయుండి మమ్ములను ఆకర్షించింది. రాగలహరి సీరియల్ చాలా బాగుంటోంది. రచయితకు ధన్యవాదములు. స్పందన కూడా బాగుంటోంది. ఈ వారం కార్టూన్లు చాలా నవ్వు తెప్పించాయి.

నోరి వెంకట శ్రీరామచంద్రమూర్తి (కాకినాడ)

## పెద్ద కథ

అనుబంధాలు అంతఃకరణలు పెద్దకథ చదివాము.. శృంగార కథల పత్రికలో ప్రచురించవలసిన ఇలాంటికథను ఒక ప్రముఖ రచయిత్రి కలం నుంచి వెలువడినందుకు మేము చింతిస్తున్నాము.

జె. బసవరాజు, పి.నాగభూషణం [మొలగవల్లి].

* * *

తెనాలి సుశీలాదేవి పెద్దకథ అనుబంధాలూ— అంతఃకరణలు చాలాచాలా స్వీట్‌గా ఉన్నది. శంకరం లాంటి మంచివాళ్ళు ఇంకా ఉన్నారా అనిపించింది కథ చదువుతుంటే. ఏది ఏమైనా ఈవారం కథలన్నీ పత్రికకే హైలైట్స్.

అడివి నాగలక్ష్మి [అయోధ్యానగరం].

అజ్ఞాత రచయిత కథ చదివాను. మల్లాదిగారు చాలా ఈజీగా కథలు రాస్తారనిపిస్తుంది.

బద్వేలి రమేష్ [అనంతపురం].

**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**




"ఎందుకంటే మేము సూపర్ డస్ట్ టీనే వాడతాం. దానియొక్క చిక్కటి డికాక్షన్. అమోఘమైన రుచి మా అందరికి ఎంతో నచ్చుతుంది. అదిగాక అది వాడితే చాలా మితవ్యయం కూడా సూపర్ డస్ట్ టీ తప్ప మరియే యితర టీ మా కుటుంబంలో వాడేందుకు వొప్పుకోరు. అందుకని మా కుటుంబం "సూపర్" కుటుంబం అని పిలువబడుతుంది"

**సూపర్ రుచి. సూపర్ డికాక్షన్. సూపర్ మితవ్యయం.**

# బ్రూక్ బాండ్
# సూపర్ డస్ట్

**భారత దేశంలో అత్యధికంగా అమ్మబడుచున్న ప్యాకెట్ టీ**

# సుబ్రమణ్యంగారి కుటుంబం ఎందుకు 'సూపర్' కుటుంబం అయింది?

HTC-BBI-3986

# మంగళకరమైన వెన్నెల మోమును మెరుగు పరచటానికి

# ఐటెక్స్

## మాట్ ఫినిష్ తిలకం

దేశమంతటా నాగరిక యువతులు కోరి ధరించేది ఐటెక్స్ తిలకం నారీమణుల ప్రస్ఫు విధానాన్ని అద్భుత సౌందర్యాన్ని ప్రస్ఫుటం చేసేటందుకే కమ్మలకింపైన 14 రంగులలో దొరుకుచున్నది. శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు ఐటెక్స్ తిలకం వాడాలి. ఎటువంటి హానియు కలుగజేయదు

ఐటెక్స్ 38 సంవత్సరములుగ మీ నమ్మకానికి పాత్రమైన ఉన్నతమైన చిహ్నం.

అరవింద్ లాబరేటరీస్
మద్రాసు 600 033




Imageads-AL-1292-Tel